# భక్తిరేవ గరీయసీ

రచన :

డా॥ సముద్రాల దశరథ

BHAKTI REVA GAREEYASEE

By

Dr. S. DASARATHA

First Edition : July 1997

Copies : 750



Price : Rs. 20/-

*Published by*

**SAMUDRALA PUBLICATIONS**

2-17, Rangareddy Building,

M.R. Palli, TIRUPATI.

This book is published with the Financial Assistance of Tirumala Tirupati Devasthanams, Tirupati. Under their scheme "Aid to Publish Religious books".

Designed & Printed at **"Annapurna Graphics"**, Tirupati. ✆ : 26807

# ప్రదీపిక

భగవానుని యందలి పరమ ప్రేమయే భక్తి. పరమ ప్రేమ అనగా మానవ మానసిక పరిధులను దాటి హృదయాందర్గతమై నిత్య సత్య స్వరూపుడగు దేవదేవుని రూపగుణగణముల సందర్శన ధ్యానాకాంక్షతో కూడినది. అన్య వాంఛా విరహితుడై, నిరంతర చింతనచే ఆ పరమాత్మను చేరగోరువాడే భక్తుడు. ప్రారంభమునందు భక్తుడు భగవంతుని ప్రార్థించుచు పురోగమించుటను అపరాభక్తియని, భక్తిసాధన పరిపూర్ణమై భగవదనుగ్రహమును అనుభవ పూర్వకముగా పొంది పరమానందము నందుట పరాభక్తి యని పేర్కొనబడినది. ఈ కలియుగమున సర్వజనులకు సులభమగు ముక్తి మార్గము భక్తి మార్గమే.

భక్తి తత్త్వ ప్రతి పాదకములగు గ్రంథము లెన్నియో కలవు. నారద శాండిల్యాది భక్తి సూత్రములు జటిలములై, సంక్షిప్తములై, సంస్కృతము నందుండుట వలన వాటి నిగూఢార్థము పండితులు వివరించిన గాని సామాన్యులకు సుబోధకములు కావు.

శ్రీ డా॥ సముద్రాల దశరథ , M.A., B. Ed., Ph. D., భక్తి గ్రంథముల నన్నిటిని పరిశీలించి అందలి భక్తితత్త్వ సారమును సరళమధుర శైలిలో రచించిన ఈ ''భక్తిరేవ గరీయసీ'' అను గ్రంథము పండిత పామరులను అలరింపగలదు. భక్తి స్వరూపమును, భక్తి మార్గములను, భక్తి మహిమను వివరించుటయే గాక కొందరు ముఖ్య భక్తుల గాథలను చేర్చుటచే ఈ గ్రంథమునకు పరిపూర్ణత లభించినది. ఇది సర్వజనాదరణమునకు పాత్రమై భక్తి మార్గానువర్తులను చేసి తరింప జేయగలదని ఆశించు చున్నాను.

ఇట్లు

తిరుపతి. బుధజన విధేయుడు

2.7.97. నైనారు అప్పాస్వామి.

# కృతజ్ఞత

జీవుని చరమ లక్ష్యం మోక్షం. చతుర్విధ పురుషార్థాలలో మోక్షం కడపటిది. జన్మ జరామరణ ప్రవాహం నుండి విడుదల పొందడాన్నే 'మోక్షప్రాప్తి' అంటారు.

మోక్షప్రాప్తికి పలురకాల ఉపాయాలు శాస్త్రాలలో ప్రతిపాదింపబడ్డాయి. కర్మ, భక్తి, ధ్యాన, జ్ఞాన యోగాలన్నీ మోక్షానికుపాయాలే, అయితే వివేక చూడామణిలో శంకర భగవత్పాదులు 'మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ' అని చెప్పారు. అంటే మోక్షోపాయాలలో భక్తియే ప్రముఖమైనది. అందులోనూ ప్రపత్తి రూపమైన భక్తి ఈ కాలానికెంతో తగినదని శాస్త్రాలు ఉద్ఘోషిస్తున్నాయి.

'భక్తిరేవ గరీయసీ' అన్న శీర్షికతో ఈ గ్రంథంలో భక్తి అనే పదానికి నిర్వచనాన్ని, భక్తి మార్గాల్లో వుండే భేదాలను నేను సోదాహరణంగా వివరించాను. చివర ప్రహ్లాదుడు, ఆంజనేయుడు, మార్కండేయుడు, పురందరదాసు, గజేంద్రుడు, ధ్రువుడు అనే ఆరుగురు భక్తాగ్రేసరుల చరిత్రలు కూడా జోడించాను. ఈగ్రంథ రచనలో నాకు భగవద్గీత, భాగవతం, మహర్షి, సద్గురు శ్రీమలయాళస్వాములవారి రచనలు ఉపకరించాయి. దీనిని సావధానంగా పరిశీలించి ప్రదీపిక అన్న పేరుతో నాకృషిని అభినందించి, నన్నాశీర్వదించిన శ్రీ నైనారు అప్పాస్వామికి కృతజ్ఞుడను.

ఈగ్రంథముద్రణకు ఆర్థిక సహకారమందించిన తిరుమల తిరుపతి దేవస్థానం వారికి కృతజ్ఞుడను.

ముఖచిత్రకారుడు, మిత్రుడు శ్రీ యస్. బి. యస్. పాణికి కృతజ్ఞుడను.

తిరుపతి

4.7.97.

సముద్రాల దశరథ

# విషయసూచిక





# భక్తి నిర్వచనం

**భజతేః క్తిని సేవాయాం భక్తిర్నిష్పద్యతే క్రమాత్ ।**
**తతో భగవతస్సేవా భక్తి రిత్యభిధీయతే ॥**

భజ సేవాయాం అనే ధాతువుకు క్తిన్ ప్రత్యయం చేరిస్తే భక్తి అను పదమేర్పడుతుంది. భగవంతుని సేవే భక్తి అని అర్థం.

''మోక్ష సాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ'' అని శంకర భగవత్పాదుల మాట. మోక్షానికి సాధనమైన సామగ్రీ సంపదలలో భక్తియే గొప్పదని భావం. కర్మమార్గం, భక్తిమార్గం, జ్ఞానమార్గం అని మూడు మార్గాలు మోక్షానికి నిరూపించ బడ్డాయి. అందులో భక్తిమార్గం సులభమైనది, మేలైనది. ముఖ్యంగా ఈ యుగంలో అనుసరింపదగింది.

భక్తిని బోధించే గ్రంథాలు మనకు చాలా వున్నాయి. భాగవతం, భగవద్గీత మొదలైన గ్రంథాలు భగవత్తత్త్వాన్ని చాలా చక్కగా నిరూపిస్తున్నాయి. నారద భక్తి సూత్రాలు అనే గ్రంథం ఈ తత్త్వాన్ని ఇంకా మనోజ్ఞంగానూ, ఆసక్తిదాయకంగానూ భోధిస్తూ వుంది. భక్తి అనగా నేమి? ఈ ప్రశ్నకు సమాధానం అనేక గ్రంథాలు పలురకాలుగా చెపుతున్నాయి. ''సాత్వస్మిన్ పరమప్రేమరూపా'' భక్తి అనగా పరతత్త్వమునందు పరమప్రేమరూపమైనది అని నారదభక్తి సూత్రాలు నిర్వచిస్తున్నాయి. ప్రేమ అంటే ఏమిటి ? అది అనుభవైకవేద్యమే కాని నిర్వచించి నిరూపించటానికి వీలుగానిది. అందుకే నారదుడు అనిర్వచనీయం ప్రేమ స్వరూపం అని చెప్పాడు.

''పూజాదిష్వనురాగః'' ఇతి పారాశర్యః పారాశర్యుడు పూజాదులయందు అనురాగమే భక్తి అన్నాడు. ''కథాదిష్వితి'' గర్గః

గర్గాచార్యుడు భగవంతుని కథలలో అనురాగమే భక్తి అన్నాడు. ''ఆత్మరత్యవిరోధేనేతి శాండిల్యః'' శాండిల్యుడు ఆత్మయందు గల రతికి విరోధం లేకుండా చేసే భగవత్కార్యాలే భక్తి అని అభిప్రాయపడ్డాడు. నారదుడు భక్తి విషయంలో తన ముఖ్యమైన అభిప్రాయాన్ని చెపుతూ ''తదర్పితాఖిలాచారితా తద్విస్మరణే పరమ వ్యాకులతా'' అని పేర్కొన్నాడు. అంటే భగవంతుని యందే అన్ని ఆచారవ్యవహారాలను అర్పించడం, భగవంతుడు మరపుకు వచ్చినప్పుడు మిక్కిలి వ్యాకులత్వాన్ని పొందడం భక్తి అన్నాడు. ఈ స్థితికి ఉదాహరణనిస్తూ ''యథా వ్రజగోపికానాం'' అని చెప్పాడు అంటే గోకులంలోని గోపికలు చూపిన భక్తి సర్వోత్తమమైనదని అతని అభిప్రాయం. ''అనురక్తిః పరతత్త్వే భక్తిరిత్యభిధీయతే'' పరతత్త్వం పైగల అనురక్తియే భక్తి అనబడును అని చెప్పిన మాట కూడా ఇంతవరకూ వివరించిన భక్తి నిర్వచనంలోనే అంతర్భవిస్తుంది.

భక్తి సులభోపాయం అనడానికి చాలా ప్రమాణాలున్నాయి. కర్మ బహు వ్యయసాధ్యం. జ్ఞానం బహుకష్టసాధ్యం. భక్తి ఒకటే సులభసాధ్యమన్నారు శంకరాచార్యులవారు. శివానందలహరిలో భక్తి లక్షణాన్ని ఇలా చెప్పారు.

**అంకోలం నిజ బీజ సంతతి రయస్కాంతోపలం సూచికా**
**సాధ్వీ నైజవిభుం లతా క్షితిరుహం సింధుస్సరిద్వల్లభమ్ ।**
**ప్రాప్నోతీహ యథా తథా పశుపతేః పాదారవింద ద్వయం**
**చేతో వృత్తిరుపేత్య తిష్ఠతి సదా సాభక్తి రిత్యుచ్యతే ॥**

ఊడుగ చెట్టు నేలరాలిన బీజాలను తన వెుుదటికి లాక్కుంటుంది. అయస్కాంతపుశిల సూదిని తనవద్దకు ఆకర్షిస్తుంది. పతివ్రత తన పతి దగ్గరకే వెళుతుంది. తీగ తన వద్దనున్న చెట్టునే అల్లుకుంటుంది. నది సముద్రాన్నే చేరుతుంది. ఆరీతిగా మన మనోవృత్తి శివుని పాదారవిందాన్నే చేరే స్థితిని భక్తి అంటారు.

వాగ్గేయకారులు సంకీర్తన మార్గాన్ని ఆశ్రయించారు. నవ విధ భక్తి మార్గాల్లో ఇదొకటి. అన్నమాచార్యుడు భక్తిని నానా రకాలుగా పేర్కొన్నాడు.

నానా భక్తులివి నరుల మార్గములు
యేనెపాననైనా నాతడియ్యకొను భక్తి
హరికి గా వాదించుటది ఉన్మాద భక్తి
పరుల గొలువకుంటే పతివ్రతా భక్తి
అరసి యాత్మ గనుటయే విజ్ఞాన భక్తి
అరమరచి చొక్కుటే ఆనంద భక్తి
అతిసాహసాల పూజ అది రాక్షస భక్తి
అతని దాసుల సేవే అదియే తురీయభక్తి
క్షితినొక పని గోరి చేసుటే తామస భక్తి
అతడే గతని వుండుటది వైరాగ్య భక్తి
అట్టె స్వతంత్రుడౌటె అది రాజస భక్తి
నెట్టన శరణనుటే నిర్మల భక్తి
గట్టిగా శ్రీవేంకటేశు కైంకర్యమే సేసి
తట్టు ముట్టు లేనిదే తగ నిజభక్తి ॥

భక్తిని ఇన్ని రకాలుగా పేర్కొన్న అన్నమయ్య ''భక్తినీ పై దొకటె పరమసుఖము -- యుక్తి జూచిన నిజంబొక్కటీ లేదు'' అని వినుతించాడు. సంగీతంలో మేళవించిన భక్తి సర్వోత్తమమనీ దానిని మించిన సన్మార్గం లేదని వాగ్గేయకారుల అభిప్రాయం. అందుకే త్యాగయ్య ''సంగీత జ్ఞానము - భక్తి వినా సన్మార్గము గలదే మనసా'' అని కీర్తించాడు.

ఈ భక్తిలో వున్న తొమ్మిది రకాలైన భేదాలను ఈ గ్రంథంలో తరువాత వివరించడం జరిగింది. భక్తిలో వున్న క్లేశాన్ని గమనించి రామానుజులు, వేదాంత దేశికులు మొదలైన విశిష్టాద్వైత మతాచార్యులు భక్తికన్నా ప్రపత్తి సులభోపాయమన్నారు. ప్రపత్తి అంటే శరణాగతి. దీనినే భరన్యాసం అంటారు. సర్వాత్మనా భగవంతునికి తనను తాను సమర్పించుకోవడమే ప్రపత్తి అంటే శరణాగతి. దీనినే భరన్యాసం అంటారు. సర్వాత్మనా భగవంతునికి తనను తాను సమర్పించుకోవడమే ప్రపత్తి. ఇందులో భక్తుడు తన భారాన్ని భగవంతుని మీదనే ఉంచుతాడు. పిల్లి పిల్ల తన బాగోగులను పూర్తిగా తల్లికే వదలినట్లు మన సర్వస్వాన్ని భగవంతునికి వదలడమే ప్రపత్తి. భగవద్గీతలోని ''సర్వధర్మాన్ పరిత్యజ్య

మామేకం శరణం వ్రజ'' అనే చరమ శ్లోకంలో ఈశరణాగతి మార్గం ప్రస్తావించబడింది. దీనిని అనేక రీతుల వైష్ణవాచార్యులు వివరించారు.

భక్తిని స్థూలంగా, సూక్ష్మంగా, సమగ్రంగా నిర్వచించడం సాధ్యం కాని పని. మాతృభక్తి, పితృభక్తి, గురుభక్తి, పతిభక్తి, సోదర భక్తి, దేశ భక్తి, దైవ భక్తి, ఇలా భక్తి ఎన్నింటి మీదనో వుండవచ్చు. ఇందులో ప్రతిదానిని ఇదమిత్థమని నిర్వచించలేం కదా! కాని ఇందులో ప్రతి దానిలోను ప్రేమతత్త్వం వున్నది. భక్తిలో అనన్యభక్తిని భగవద్గీత పలుసార్లు పేర్కొన్నది. ''భక్త్యా త్వనన్యయా శక్య:'' ఇత్యాది వచనాలలో అనన్య భక్తి మాత్రమే భగవత్ప్రాప్తికి మార్గమని చెప్పబడింది. ''అనన్యాశ్చింతయంతో మాం'' అన్న శ్లోకంలో అనన్యా: అన్న పదం అనన్య భక్తి ని అనగా అన్యచింతలేని భగవద్భక్తిని నిరూపించింది.



# భక్తి తత్త్వాలు

**శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్ ।**

**అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనమ్ ॥**

1) శ్రవణం 2) కీర్తనం 3) స్మరణం 4)పాదసేవనం 5) అర్చనం 6) వందనం 7) దాస్యం 8) సఖ్యం 9) ఆత్మనివేదనం.

**శ్రవణం :--** అనంత కళ్యాణ గుణ పరిపూర్ణుడైన భగవంతుడు, రక్షించుటకు అవతరించిన కథలను వినుట.

**తత్రైవ గంగా యమునా చ వేణీ గోదావరీ సింధు సరస్వతీచ ।**

**సర్వాణి తీర్థాని వసంతి తత్ర యత్రాచ్యుతోదారకథా ప్రసంగః ॥**

ఎక్కడ భగవంతుని భక్తి కథా ప్రసంగాలు జరుగునో, అక్కడ గంగ, యమున, కృష్ణవేణి, గోదావరి, సింధు, సరస్వతి మొదలైన తీర్థాలు వచ్చి చేరును. ఉదా : పరీక్షిద్రాజు.

పరీక్షిత్తు పాండవుల సంతతికి చెందినవాడు. అర్జునుడికి మనమడు. పాండవుల మరణానంతరం హస్తినా పట్టణానికి రాజైనాడు. ఒకనాడు వేటకుపోయి దప్పిగొని సమాధిలో నున్న ఒక ఋషిని జలమడిగాడు. సమాధానం కానక చచ్చిన పామును ఆయన మెడలో వేశాడు. ఋషి కుమారుడు అతనిని 7 రోజులలో పాము కాటుతో మరణిస్తావని శపించాడు. అది తెలిసి పరీక్షిత్తు ప్రాయోపవేశం చేశాడు. శుకుని నుండి భాగవత కథ విని తరించాడు.

**కీర్తనం :--** భగవంతుని కళ్యాణ గుణాలను కీర్తించుట.

**గోవిందేతి సదాస్నానం గోవిందేతి సదా జపమ్ ।**

**గోవిందేతి సదా ధ్యానం సదా గోవింద కీర్తనమ్ ॥**

అన్నమయ్య, త్యాగయ్య, నారదుడు వీరందరూ భగవంతుని కీర్తించినవారే. ''భక్తి నీపై దొకటె పరమ సుఖము యుక్తి జూచిన నిజంబొక్కటీ లేదు'' అని అన్నమయ్య, ''సంగీత జ్ఞానము - భక్తి వినా సన్మార్గము గలదే మనసా'' అని త్యాగయ్య భగవంతుని కీర్తించి తరించారు.

స్మరణం :-- భగవంతుని దివ్యనామాలను, గుణాలను స్మరించుట.

**నారాయణో నామ నరో నరాణాం ప్రసిద్ధ చోరః కథితః పృథివ్యామ్ ।**

**అనేక జన్మార్జిత పాప సంచయం హరత్య శేషం స్మరతాం సదైవ ॥**

భూమిపై నారాయణుడనే దొంగ వున్నాడు. అతడు తనను స్మరించే వారి పాపాలన్నింటిని హరించి వేస్తాడు. కాబట్టి మనమంతా ఆ నారాయణుని స్మరిద్దాం.

**నమామి నారాయణ పాద పంకజం కరోమి నారాయణ పూజనం సదా ।**

**వదామి నారాయణ నామ నిర్మలం స్మరామి నారాయణ తత్త్వ మవ్యయమ్ ॥**

నారాయణుని పాదపంకజాలకు నమస్కరిస్తాను. సదా నారాయణుని పూజిస్తాను. నిర్మలమైన నారాయణ నామాన్ని పలుకుతాను. అవ్యయమగు నారాయణ తత్త్వాన్ని స్మరిస్తాను.

**మనసా కర్మణా వాచా యే స్మరన్తి జనార్దనమ్ ।**

**తత్ర తత్ర కురుక్షేత్రం ప్రయాగో నైమిషం వనమ్ ॥**

త్రికరణశుద్ధిగా ఎవరు జనార్దనుని స్మరిస్తారో, అచట అచట కురుక్షేత్రం, ప్రయాగ, నైమిశారణ్యం వంటి మహా పవిత్ర క్షేత్రాలు అలరారుతాయి.

**నాస్తి నాస్తి మహాభాగ కలికాల సమం యుగమ్ ।**

**స్మరణాత్కీర్తనాదేవ ప్రాప్నోతి పరమాం గతిమ్ ॥**

ఓ మహాశయా! కలికాలానికి సమానమైన యుగం లేదు. ఎందుకంటే ఈ యుగంలో స్మరించినా, కీర్తించినా సర్వోత్కృష్టమైన మోక్షం పొందగలరు.

కౌరవపాండవుల యుద్ధం ముగిసింది. కృష్ణుడు ద్వారకకు బయలు దేరుతుంటే ధర్మరాజు వచ్చి ఈ రాత్రికి ఇక్కడే విశ్రాంతి

తీసుకోండి. రేపు వెళ్లుదురు అన్నాడు. కృష్ణుడు ఆగిపోయాడు.

సాధారణంగా ధర్మరాజు బ్రాహ్మీ ముహూర్తాన లేచి కృష్ణుని చిత్రపటానికి నమస్కరించేవాడు. ఈరోజు ఆయన ఇక్కడే వున్నాడు కదా! ప్రత్యక్షంగా నమస్కరిద్దామనుకొని వెళ్ళి చూచి ఆశ్చర్యపోయాడు.

అప్పటికే కృష్ణుడు బద్ధపద్మాసనంలో ధ్యానంలో లీనమై వున్నాడు. ఆయన ధ్యానాన్ని భంగం చేయడం ఇష్టంలేక వెనుదిరగబోయాడు. గోవిందుడు కళ్ళు తెరచి ధర్మరాజా! అన్నాడు. స్వామీ! ఈ సమయంలో మీరు ఎవరిని గురించి ఆలోచిస్తూ వున్నారు? అని అడిగాడు. రాజా! భీష్ముడు అంపశయ్యపై నుండి నన్నే స్మరిస్తూ వున్నాడు. అందుకే నేను ఆయనను గురించి స్మరణ చేస్తూ వున్నాను అన్నాడు. ''యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజామ్యహమ్'' ఎవరు ఏవిధంగా నన్ను గురించి ప్రార్థిస్తేవారిని ఆవిధంగా భజిస్తాను అని కృష్ణడే అన్నాడు గదా! కాబట్టి మనం భగవంతుని స్మరిస్తే ఆయన మన గురించి స్మరిస్తాడు. ఉదా :-- శుకుడు.

శుకుడు వ్యాసుని పుత్రుడు. మహాయోగి. పరీక్షిత్తుకు భాగవతం చెప్పింది ఇతడే. సదా భగవత్స్మరణ చేయువాడు.

**పాదసేవనం** :-- భగవంతుని పాదాలను సేవించుట. ఉదా : లక్ష్మణుడు.

రామావతారంలో శేషుడు లక్ష్మణుడుగా పుట్టాడు. వైకుంఠంలో సదా భగవంతుని సేవ చేయువాడు శేషుడు. రామావతారంలో భగవత్సేవను వీడక రాముడితో పాటు అరణ్యవాసం చేశాడు. హనుమంతుని వలె ఇతడు రామసేవాధురంధరుడు.

**అర్చనం** :-- పరమ పురుషుని పూజించుట. పత్రం పుష్పం ఫలం తోయం వీటితో భగవంతుని పూజించుట. ఉదా : పృథు చక్రవర్తి.

భగవంతుని పూజ ఫలప్రదం. ద్వాపరయుగంలో ఈ అర్చనకు మిక్కిలి ప్రాముఖ్యం వుండేది. ఈనాడు దేవాలయాలలో అర్చారూపంలో వున్న మూర్తులను అర్చిస్తూ వున్నారు. తిరుమలలో శ్రీ వేంకటేశ్వరుడికి నిత్యార్చనలు జరుగుతున్నాయి.

పృథు చక్రవర్తి సరస్వతీ నదీ తీరంలో అనేక క్రతువులు చేశాడు. ధర్మాన్ని వీడకుండా రాజ్యపరిపాలన నిర్వహించాడు. గోరూపధారిణియైన భూమి నుండి మనువును దూడగ చేసి సర్వౌషధాలను పితికినాడు. యాగాలద్వారా భగవంతుని అర్చించిన కీర్తి ఇతనికి దక్కింది.

**వందనం :--** భగవంతునికి ప్రదక్షిణ నమస్కారాలు చేయుట.

**మేఘశ్యామం పీతకౌశేయవాసం**
**శ్రీవత్సాంకం కౌస్తుభోద్భాసితాంగమ్ ।**
**పుణ్యోపేతం పుండరీకాయతాక్షం**
**విష్ణుం వందే సర్వలోకైక నాథమ్ ॥**

మేఘం వలె శ్యామవర్ణం గలవాడు, పచ్చని పట్టు వస్త్రం ధరించినవాడు, శ్రీవత్సమను గుర్తు కలవాడు, కౌస్తుభమణిచే ప్రకాశించు దేహం గలవాడు, పుణ్యాత్ములగు భక్తులతో కూడినవాడు, తెల్ల తామర రేకుల వలె విశాల నేత్రాలు గలవాడు, సమస్తలోకాలకు ఏకైక ప్రభువగు విష్ణుదేవునకు వందనం.

**గోవింద కేశవ జనార్దన వాసుదేవ**
**విశ్వేశ విశ్వ మధుసూదన విశ్వనాథ !**
**శ్రీ పద్మనాభ పురుషోత్తమ పుష్కరాక్ష !**
**నారాయణాచ్యుత నృసింహ నమో నమస్తే ॥**

గోవిందా ! కేశవా ! జనార్దనా ! వాసుదేవా ! విశ్వేశా ! విశ్వరూపా! మధుసూదనా ! విశ్వనాథా ! పద్మనాభా ! పురుషోత్తమా ! పుష్కరాక్షా ! నారాయణా ! అచ్యుతా ! నృసింహా నీకు నమస్కారం నమస్కారం.

ఉదా : అక్రూరుడు.

అక్రూరుడు మధురానగరంలో వుండేవాడు. కృష్ణుని ప్రేరణతో కృష్ణుని బృందావనం నుండి మధురకు తీసుకు వచ్చాడు. యమునా నదిలో స్నానం చేస్తూ భగవంతుని దివ్యరూపాలను నీటిలో చూచాడు. ద్వారకలో వర్షం లేనపుడు అక్రూరుని రాకతో వర్షం కురిసిందని పురాణాలు తెలుపుతున్నవి. బృందావనానికి వెళ్ళినపుడు గోవిందుని సందర్శించి వందనములాచరించితరించాడు. అందువలన వందన రూపమైన భక్తికి అక్రూరుని ఉదాహరణగా చెబుతారు.

దాస్యం :-- భగవన్మందిరంలో అన్నివిధాలా కైంకర్యం చేయుట.

ఉదా : ఆంజనేయుడు.

**మజ్జన్మనః ఫలమిదం మధుకైటభారే**
**మత్ప్రార్థనీయ మదనుగ్రహ ఏష ఏవ !**
**త్వద్భృత్య భృత్య పరిచారక భృత్య భృత్య**
**భృత్యస్య భృత్య ఇతి మాం స్మర లోక నాథ ||**

మధుకైటభులను రాక్షసులకు శత్రువగు ఓ జగన్నాథా! నాజన్మ సఫలం కావాలంటే నేను ప్రార్థింపదగింది, నీవనుగ్రహింపదగింది ఒకటుంది. అదేమిటంటే. నీదాసులకు దాసులైన వారికి, దాసులైన వారికి దాసులుగా వుండు వారికి, దాసత్వ మొనరించు వారికి సేవ చేయువారి, భటులైవున్న వారికి దాసునిగా నన్ను భావించు. ఇది దాస్య భక్తి.

**వాసుదేవస్య యే భక్తాః శాన్తా స్తద్గత మానసాః |**
**తేషాం దాసస్య దాసోహం భవే జన్మని జన్మని ||**

ఎవరు వాసుదేవునకు భక్తులై, శాంతచిత్తులై, భగవదర్పిత బుద్ధులై వుందురో, అట్టి వారికి దాసుడనై నేను ప్రతిజన్మయందు జన్మించెదను గాక!

**నాన్యం వదామి నశృణోమి నచిన్తయామి**
**నాన్యం స్మరామి నభజామి నచాశ్రయామి |**
**భక్త్యాత్వదీయ చరణాంబుజమన్తరేణ**
**శ్రీశ్రీనివాస పురుషోత్తమ దేహి దాస్యమ్ ||**

శ్రీనివాసా! పురుషోత్తమా ! భక్తితో నీపాదారవిందాలను తప్ప, ఇతరమైన దానిని గురించి పలుకను, వినను, స్మరింపను, భజింపను, ఆశ్రయింపను. అట్టి నీ సేవాభాగ్యాన్ని నాకనుగ్రహింపుము.

హనుమంతుడు రాముని పట్ల దాస్య భక్తితో తరించినాడు. సీతాన్వేషణకు సహకరించినాడు. రాముని సదా తన హృదయంలో ధ్యానించినాడు. రామునికి నమ్మిన బంటు. రామాయణంలో సుందరకాండలో ప్రధాన పాత్రఆంజనేయునిదే.

సఖ్యం :-- భగవంతుని మైత్రీ భావంతో ప్రాణంవలె

ప్రేమించుట. ఉదా : అర్జునుడు.

అర్జునుడు సుభద్రకు భర్త. సుభద్ర కృష్ణుని చెల్లెలు. అందువల్ల వీరికి బాంధవ్యమున్నది. కృష్ణార్జునులు నరనారాయణులు. కృష్ణుడు భగవంతుడని తెలియక అర్జునుడు మైత్రీభావంతో హేకృష్ణా ! హే యాదవా! హే సఖా ! అని అనేవాడు. ఈ సఖ్య భావంతోనే భగవంతుని ప్రేమించినాడు. గీతా సందేశానంతరం కృష్ణుని భగవత్తత్వాన్ని గుర్తించాడు. తరువాత గూడా మైత్రీ భావంతోనే మెలిగాడు. అందువల్ల అతడు సఖ్య భక్తి కలవాడు.

**ఆత్మనివేదనం** :-- తనను, తనకు సంబంధించిన వాటిని భగవంతునికి సమర్పించుట 'అన్యథాశరణం నాస్తి త్వమేవ శరణం మమ' అని భక్తితో తన సర్వస్వాన్ని సమర్పించుటే ఆత్మనివేదన భక్తి.

బలిచక్రవర్తి -- ఇతడు తన సర్వస్వమును భగవంతునికి అర్పించాడు. భగవంతుడు భూమ్యాకాశముల నాక్రమించి మూడవ పాదానికి చోటు అడిగినపుడు తన శిరస్సుపై పెట్టమన్నాడు. భగవంతునిచే పాతాళానికి తొక్కబడ్డాడు. అలా భగవదనుగ్రహానికి పాత్రుడయ్యాడు.



# చతుర్విధభక్తులు

**చతుర్విధా భజంతే మాం జనాః సుకృతి నోర్జున ।**

**ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ ॥**

అని కృష్ణుడు నాల్గు రకాల భక్తులు నన్ను భజిస్తారు అని అర్జునునితో చెప్పాడు. ఆర్తుడు, అర్థార్థి, జిజ్ఞాసువు, జ్ఞాని.

బాధల నుండి విముక్తి కోరేవాడు ఆర్త భక్తుడు. అటువంటి వారిని కాపాడేవాడు కాబట్టి ఆ భగవంతునికి ఆర్తత్రాణ పరాయణుడని పేరు వచ్చింది.

గజేంద్రుడు :-- గజేంద్రుడు అనేక కరిణీ సమూహములతో అడవుల్లో తిరుగుతూ ఎండకు తపించి ఒకమడుగులో ప్రవేశించాడు. అక్కడ ఒక ముసలి అతని పాదాలను బట్టి లాగింది. కరి మకరాలకు వెయ్యేండ్లు పోరాటం జరిగింది. చివరికి కరి తన బలం తరగడం, ముసలి బలం పెరగడం గమనించింది. ఆర్తుడై, దీనుడై, భగవంతునికి శరణాగతుడై ''రావే ఈశ్వర! కావవే వరద! సంరక్షించు భద్రాత్మకా!'' అని మొరపెట్టు కొన్నది. అపుడు విష్ణువు వచ్చి మకరిని సంహరించి కరిని కాపాడాడు. ఆర్తుడై భగవంతుని వేడినవాడు కావున గజేంద్రుడు ఆర్తభక్తుడు.

అధికారం, ఐశ్వర్యం, కీర్తి కావాలని కోరుకొనేవాడుఅర్థార్థి భక్తుడు.

ధ్రువుడు :-- ఉత్తానపాదుని కుమారుడు. సురుచి ఇతని సవతి తల్లి. ఆమె చేత అవమానింపబడి, ఇతడు ఉత్తమ స్థితిని పొందగోరి తల్లి

సునీతి అనుమతితో అడవికి పోయాడు. నారదుడు ఇచ్చిన మంత్రం జపించి విష్ణువును ప్రసన్నుని గావించుకొన్నాడు. విష్ణువు ప్రత్యక్షమై ఉన్నత పదవినిచ్చాడు. ఉన్నత స్థితిని కోరినవాడు కావున ఇతడు అర్థార్థి భక్తుడు.

పరమాత్మ తత్త్వాన్ని గూర్చి తెలుసుకోవాలనుకొనేవాడు జిజ్ఞాసుభక్తుడు.

**ఉద్ధవుడు** :— జిజ్ఞాసు భక్తుడు. జిజ్ఞాస అనగా తెలుసు కోవాలన్న కోరిక. ఆ కోరికతో పలువిషయాలను కృష్ణుని అడిగి తెలుసు కున్నాడు కాబట్టి ఉద్ధవుడు జిజ్ఞాసు భక్తుడనబడినాడు. ఉద్ధవగీత లోకప్రసిద్ధం. భగవద్గీతలో వలె ఇందులోనూ ఆత్మప్రాప్తికి కావలసిన అనేక విషయాలు పొందుపరచబడినాయి.

సాధన ముగిసి ప్రత్యక్షానుభూతిగల జీవన్ముక్తులు శుకుడు, ప్రహ్లాదుడు.

**ప్రహ్లాదుడు** :— హిరణ్యకశిపుని కుమారుడు. అతడు గర్భంలో వుండగనే నారదుని ఉపదేశంతో భగవద్భక్తుడైనాడు. హిరణ్యకశిపుడు భగవద్విరోధి. ప్రహ్లాదుడు అజ్ఞానంతో వున్నాడని తండ్రి అతనిని చదివించినాడు. కాని లౌకిక విద్యలతనికి పట్టలేదు. భగవద్భక్తియే తరణోపాయమని అతడు భావించినాడు. తండ్రి తనను పరీక్షించినపుడు ఆవిషయమే చెప్పినాడు. ప్రహ్లాదుడు పైకి భక్తుడు లోపల జ్ఞాని. శుకుడు లోపల భక్తుడు పైకి జ్ఞాని. నవ విధ భక్తి మార్గాలను తండ్రి వద్ద ప్రస్తావించినవాడు ప్రహ్లాదుడే. హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని చంపవలెనని చేసిన ప్రయత్నములు వ్యర్థములైనాయి. తుదకు సర్వవ్యాపియైన భగవంతుడు స్తంభంలో నరసింహరూపంలో ప్రత్యక్షమై రాక్షసుని సంహరించాడు. ప్రహ్లాదుని కాపాడాడు. ''ఎందెందు వెదకి చూచిన అందందే విష్ణువు కలడ''న్న భక్తుడు కావున, ప్రహ్లాదుడు జ్ఞానిభక్తుడు.

ఈవిధంగా కృష్ణుడు తన భక్తులు నాల్గు రకాలని నలుగురూ భగవంతుని భజించు వారేనని, అందరూ పుణ్యాత్ములేనని, వారిలో జ్ఞాని నిత్యయుక్తుడని, జ్ఞానికి తనకు భేదం లేదని ''జ్ఞానీత్వాత్మైవ మే మతమ్'' అన్నాడు. కావున జ్ఞాని భక్తుడు సర్వ శ్రేష్ఠుడు.



# భక్త లక్షణాలు

**అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవచ ।**

**నిర్మమో నిరహంకారః సమదుఃఖ సుఖఃక్షమీ ॥**

**అద్వేష్టా సర్వభూతానాం** :-- ఏ భూతాన్నీ ద్వేషించకుండా వుండడం. అంటే సకల ప్రాణులయందు స్నేహభావం కలిగి వుండడం. మానవ జాతి మీదనే కాదు. పశు, పక్షి, క్రిమి, కీటకాది చరాచర భూతాలలో ఎప్పడూ ఎక్కడా ద్వేషభావం లేకుండా వుండడం. ''లోకాః సమస్తాః సుఖినో భవంతు'' అని కోరుకోవడం. భక్తుని మొట్టమొదటి లక్షణంగా భగవంతుడు పేర్కొన్నాడు.

**న త్వహం కామయే రాజ్యం న స్వర్గం నా పునర్భవమ్ ।**

**కామయే దుఃఖ తప్తానాం ప్రాణినా మార్తి నాశనమ్ ॥**

నాకు రాజ్యం వద్దు, స్వర్గం వద్దు, పునర్జన్మ లేని ముక్తి కూడ వద్దు. దుఃఖంతో తపిస్తున్న ప్రాణికోట్ల దుఃఖాలను రూపుమాపుటయే నేను కోరేది. అని అర్జునుడు అంటాడు. 'భూతదయ' అంటే అది.

**మైత్రః** :-- మైత్రీ భావం కలవాడు మిత్రుడు. మిత్రుడనగాసూర్యు డని కూడా ఒక అర్థం. సూర్యుడు తన ప్రకాశాన్ని సకలప్రపంచాలకు పంచినట్లు, మిత్రుడు( భక్తుడు) స్నేహాన్ని అందరికీ సమానంగా అందజేస్తాడు.

**యూయం వయం వయం యూయం ఇత్యాసీన్మతిరావయోః ।**

**సంజాతమధునా మిత్ర యూయం యూయం వయం వయమ్ ॥**

మిత్రమా! ఇంతకు ముందు మీరు మనంగా మనం మీరుగా వుండినాము కదా! ఇపుడు మీరు మీరే మేము మేమే. అంటున్నావే అంటే

అవసరమైతే మిత్రుడు, లేకపోతే శత్రువు అనేది మిత్రత్వంకాదు.

**కరుణ** :-- దయా స్వభావం కలిగి వుండడం. ''దయగల హృదయమే భగవన్నిలయం'' అని మహర్షి - సద్గురు - శ్రీమలయాళ స్వాముల వారి సూక్తి. వారి నిజ జీవితంలో వారు మొట్టమొదట ఆచరించింది ఈ సూక్తినే. దయలేని హృదయమే వ్యర్థం. ముఖ్యంగా ఆపద సమయంలో ఆదుకొన్నవాడే నిజమైన భక్తుడు. అటువంటివాడే భగవంతునికి ప్రియుడు. ''విభాతి కాయః కరుణా పరాణాం పరోపకారేణనచందనేన'' ఎవరి శరీరమైనా పరోపకారం వలన, పరులయందు కరుణ చూపుట వలన శోభిస్తుందే కాని చందనం చేత కాదు.

**బ్రహ్మాది స్తంబపర్యన్త సకల ప్రాణి కోటయః ।**
**ప్రభు సృష్టా మమైవేతి పరభక్తో హి స్నిగ్ధవాన్ ॥**

పిపీలికాది బ్రహ్మాపర్యన్తం సమస్తప్రాణి కోట్లను పరమేశ్వరుడే సృష్టించినాడనితలంచి వాటియందు 'దయ' గలిగిన వాడే భక్తుడు.

గుణాలలో దయాగుణం ఉత్తమమైనది. దయలేని వారు మహాత్ములు కాలేరు. అవతార పురుషుడుగా భావింపబడిన బుద్ధుడు దయామయుడు. దేవదత్తుడు హంసను బాణంతో కొట్టినపుడు అది నేల కూలినది. సిద్ధార్థుడు దానిని ఎత్తుకున్నాడు. దేవదత్తుడు ఇది నాహంస అని వాదించినాడు. వివాదం న్యాయస్థానం కెక్కినది. న్యాయాధికారులు పక్షి రక్షింపబూనిన వానిదే గాని భక్షింపబూనిన వానిది కాదని తీర్మానించారు. ఇట్టి ఉత్తమ గుణాలచేతనే బుద్ధుడు అవతార పురుషుడైనాడు.

భగవంతుడు కూడా దయామయుడే. అందుకే వేదాంతదేశికుల వారు దయను అనేక విధాలుగా స్తుతిస్తూ దయా శతకం వ్రాశారు. గుణాలన్నింటిలో దయాగుణమే మిన్న అని దయా శతకం వర్ణిస్తున్నది.

**నిర్మమః** -- మమకారంలేనివాడు నిర్మముడు. మమకారం అహంకారానికి సూచన కాబట్టి, ఇది నాది అది నాది అనే భావం లేకుండా 'సర్వం కృష్ణార్పణమస్తు' అనుకొనేవాడు నిజమైన భక్తుడు. మమకారం లేనివాడే శాంతిని పొందగలడు. అర్జునుడు మమకారం తోనే

కర్తవ్య విముఖుడైనాడు. యుద్ధం చేయనన్నాడు. ఏయి నావారు వీరిని చంపటం తగదన్నాడు. మమకారం వలన వ్యామోహం కలిగింది. వ్యామోహం వలన కర్తవ్యచ్యుతుడైనాడు ఇట్టి మమకారం తగదని కృష్ణుడు బోధించినాడు. భక్తుని మమకారం భగవంతుని పైననే గాని బాహ్యవిషయాల పైన వుండరాదు.

**నిరహంకారః** - నిరహంకారుడంటే అహంకారం లేనివాడు., నిరహంకారుడే నిజమైన భక్తుడు. అహంకారాలు అనేక రకాలు. విద్యవలన, ధనంవలన, అందంవలన, చివరకు నేను నిరహంకారిని అని అనుకోవడం వలన కూడా అహంకారమే జనిస్తుంది. ఇటువంటి అహంకారాలనుండి బయటపడినవాడు ముక్తుడు, భక్తుడు. ''నిరహంకారః సశాంతి మధి గచ్ఛంతి'' అహంకారం లేనివాడే శాంతిని పొందగలడు.

అహంకారం రాక్షస లక్షణం. అది మోక్ష మార్గానికి ఆటంకం. ఒక సన్న్యాసికి మరణమాసన్నమైనది. యోగ దృష్టితో గ్రహించినాడు. యోగశక్తితో తనవంటివారిని 100 మందిని సృష్టించాడు. సమయానికి మృత్యుదేవత వచ్చింది. ఎవరిని గ్రహించవలెనో మృత్యుదేవతకు అర్థంకాలేదు. అందరూ ఒకే రకంగా వున్నారు. మృత్యుదేవత ఆలోచించి అంతా బాగానే చేశావు కాని ఒక్క పొరపాటు చేశావుఅంది. ఆపొరపాటేమిటి? అన్నాడు. అసలు సన్న్యాసి. అంతే.మృత్యువు వాని మెడ పట్టేసింది. అహంకారం దుష్ఫలితం ఇలా వుంటుంది.

**సమదుఃఖ సుఖః** - స్థిత ప్రజ్ఞుని లక్షణం కూడా ఇదే. దుఃఖమునందు, సుఖమునందు సమానమైన భావం కలిగి వుండడం. దుఃఖం వస్తే క్రుంగిపోడు. సుఖం వస్తే పొంగిపోడు. సుఖం దుఃఖం రెండూ ఆత్మప్రాప్తికి ప్రతిబంధకాలు. ఈరెండూ లేనివారు మాత్రమే పరబ్రహ్మమందు నిలువగలరు. ''దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః''.

శ్రీరామచంద్రుడు పట్టాభిషేకం తనకు జరుగనున్నపుడు సంతోషించలేదు. 14 యేండ్లు అరణ్యవాసం చేయవలసి వచ్చినపుడు దుఃఖించలేదు. రాముడు స్థిత ప్రజ్ఞుడు. భక్తుడు కూడా ఇట్టి లక్షణాలను

కలిగి వుండాలని కృష్ణుడు అన్నాడు.

**క్షమీ** -- క్షమాగుణం కలవాడు. సోక్రటీసు భార్య పరమగయ్యాళి. అనవసరంగా భర్తతో వ్యవహార మాడేది. ఒకసారి ఏదో చిన్న విషయం పైన కోపం వచ్చి భర్తను నోటికి వచ్చినట్లు మాట్లాడటం మొదలుపెట్టింది. సోక్రటీసు మిన్నకుండటం చూసి మరింత రెచ్చిపోయి నీటి కుండనెత్తి ఆయన నెత్తిపై పడేసింది. ప్రతిరోజూ ఉరుములు మాత్రమే వస్తూండేవి. ఈరోజు వాన కూడ వచ్చింది అని ప్రక్కనున్న మిత్రునితో సోక్రటీసు అన్నాడు. వెంటనే మిత్రుడు కర్ర తీసి నాలుగు బాదితే తిక్క కుదురుతుందన్నాడు. వూరుకోవయ్యా మాకిద్దరికీ వ్యవహారం బెట్టి తమాషా చూద్దామనా అని తాపీగా అన్నాడు సోక్రటీసు. ఆయన క్షమా గుణానికి మిత్రునితో పాటు భార్య కూడా తలదించుకుంది.

సోక్రటీసు తత్త్వవేత్తగా గొప్ప క్షమాగుణం చూపాడు. అందువలన క్షమా గుణం చాలా శ్రేష్ఠమైనది. ఇది భక్తులకే కాక తత్త్వవేత్తలకు కూడా అవసరమని సోక్రటీసు కథ ద్వారా తెలుస్తోంది.

**సంతుష్ట స్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః ।**
**మయ్యర్పిత మనోబుద్ధిః యో మద్భక్తస్సమే ప్రియః ॥**

**సతతం సంతుష్టః** -- సదా ఆనందంగా వుండేవాడు నిత్య సంతోషి. నిత్య నూతనుడు. క్లిష్ట పరిస్థితులలో కూడా సంతోషాన్ని కోల్పోనివాడు. సంతోషమే సగం బలం, ''సంతోషికెపుడు జరుగు సుఖము'' అని భాగవత వచనం. ఆత్మ జ్ఞాన సంపన్నుడు నిత్య సంతోషిగా వుంటాడు.

**యోగి** -- యుజ సమాధౌ అను ధాతువునుండి పుట్టిన శబ్దమే యోగం ''యోగశ్చిత్త వృత్తి నిరోధః'' సకల ఇన్ద్రియ వృత్తులను నిగ్రహించుటే యోగం. ''సంయోగం యోగ మిత్యాహు: జీవాత్మ పరమాత్మనోః'' జీవాత్మ పరమాత్మల సంయోగమే యోగం. చిత్తవృత్తులను నిరోధించుకున్నవాడే యోగి. యమనియమాద్యష్టాంగ విధులలో పరిపూర్ణుడే యోగి.

యోగ శబ్దానికి అనేక నిర్వచనాలున్నాయి. కర్మలలో కౌశలమే యోగమని భగవద్గీత పేర్కొన్నది. తపస్వులు, జ్ఞానులు, కర్మపరులు వీరందరి కంటే యోగియే అధికుడని, అందువలన నీవు యోగివి కమ్మని

కృష్ణుడు అర్జునునితో అన్నాడు.

**యతాత్మా** -- యతాత్ముడంటే నోరు, నాలుక, చేయి, పొట్ట, ఉపస్థ అనే పంచేంద్రియాలను నియమంలో పెట్టుకున్నవాడు. నిగ్రహించిన చిత్తం కలవాడు. ఇంద్రియ నిగ్రహం చాలా ప్రధాన మైనది. స్పర్శేంద్రియాన్ని నిగ్రహించుకోలేక గజం బంధింపబడు తున్నది. శ్రవణేంద్రియాన్ని నిగ్రహించుకోలేక లేడి, నయనేంద్రియాన్ని నిగ్రహించుకోలేక మిడత, రసనేంద్రియాన్ని నిగ్రహించుకోలేక చేప, ఘ్రాణేంద్రియాన్ని నిగ్రహించుకోలేక తుమ్మెద మరణిస్తున్నాయి. ఇక ఐదు ఇంద్రియాలను నిగ్రహించుకోలేని మానవుని గతి ఏమని చెప్పాలి ? అందువల్ల భక్తి మార్గంలో వుండేవారు ఇంద్రియాలను మనసును నిగ్రహించుకోవాలి.

**దృఢ నిశ్చయః** -- ధృఢమైన నిశ్చయం కలవాడు. ఈపని చేసి తీరాలి అనే సిద్ధాంతం కలవాడు. 17 సార్లు దండెత్తిన గజనీ మహమ్మదు 18 వ సారి తన దృఢనిశ్చయంతోనే భారత దేశాన్ని జయించగలిగాడు. అలాంటి పట్టుదలే వుంటే ధ్రువుడు లాగా మనంకూడా భగవంతుని కృపకు పాత్రులం కాగలం.

**మయ్యర్పిత మనోబుద్ధిః** – మనస్సును, బుద్ధిని, భగవంతునికి సమర్పించిన వాడు. మనసుకు లోబడితేజీవుడు మనసును జయిస్తే దేవుడు. ఆమనసును భగవదర్పితం చేసినవాడు భక్తుడు.

**మందార మకరంద మాధుర్యమునదేలు**
**మధుపంబువోవునే మదనములకు**
**నిర్మల మందాకినీ వీచికల దూగు**
**రాయంచ జనునె తరంగిణులకు**
**లలిత రసాల పల్లవఖాదియై చొక్కు**
**కోయిల జేరునే కుటజములకు**
**పూర్ణేందు చంద్రికా స్ఫురిత చకోరక**
**మరుగనే సాంద్రనీహారములకు**

**అంబుజోదర దివ్య పాదారవింద**

**చింతనామృత పాన విశేష మత్త**

**చిత్తమేరీతి నితరంబు జేర నేర్చు**

**వినుత గుణశీల మాటలు వేయునేల ॥**

అని ప్రహ్లాదుడు ఎవరెన్నిచెప్పినా భగవదర్పిత మైన నాబుద్ధి మారదని స్పష్టం చేసినాడు.

**యస్మాన్నో ద్విజతే లోకో లోకాన్నో ద్విజతే చ యః।**

**హర్షా మర్ష భయోద్వేగైః ముక్తో యస్స చ మే ప్రియః ॥**

ఎవరైతే లోకానికి క్షోభ కలిగించరో, ఉద్వేగం కలిగించరో లోకం వలన క్షోభ పొందరో, ఉద్వేగాన్ని పొందరో వారే భక్తులు. ''నొప్పించక తానొవ్వక తప్పించుకతిరుగువాడు ధన్యుడు సుమతీ.'' హర్షం నుండి అమర్షం నుండి, ఆనందం నుండి అసూయ నుండి, భయం నుండి ఆవేశం నుండి ముక్తుడు భక్తుడు.

**అనపేక్షశ్శుచిర్దక్షః ఉదాసీనో గతవ్యథః।**

**సర్వారంభ పరిత్యాగీ భక్తిమాన్యస్స మే ప్రియః ॥**

**అనపేక్షః** -- భక్తుడు అనపేక్షుడు. కోరికలు లేనివాడు. ఆశలేనివాడు. భక్తునికి కోరికలు వుంటే అవి భగవంతునికి సంబంధించినవై వుండాలి. విషయాల మీద ఆసక్తి దుఃఖానికి మార్గమౌతుంది. అపేక్ష ప్రపంచమందు గాక పరమాత్మ యందుండాలి. ''నిరపేక్షం మునిం శాంతం'' అని భాగవతంలో చెప్పబడింది.

నిరపేక్షుడు, ముని, శాంత స్వభావుడు వీరందరూ భగవంతుని భక్తులే. భగవంతునికి ప్రియులే.

**శుచిః** :-- భక్తుడు శుచి భగవంతుని కూడ శుచి పరచగలిగినవాడు. కేవలం బాహ్య పరిసరాలనేకాక అంతః కరణాన్ని కూడ శుచిగా పెట్టుకొనేవాడు నిజమైన భక్తుడు.

శుద్ధులు ఐదు రకములు. వస్త్రశుద్ధి, స్థలశుద్ధి, పాత్రశుద్ధి, కాయ శుద్ధి, వాక్శుద్ధి అనునవి. సాధకులు ఈ పంచ శుద్ధులను నియమం తప్పక పాటించాలి. అప్పడే భక్తుడై ముక్తిని పొందుతాడు.

**దక్షః** :-- దక్షుడంటే సమర్థుడు. దేనినైనా సాధించగల సమర్థుడు. కార్యనిర్వహణ సామర్థ్యం కలిగినవాడు. చూచి రమ్మంటే

కాల్చి వచ్చిన ఆంజనేయుడు దక్షుడు.

ఒకసారి వివేకానందుడు First Class compartment లో ప్రయాణం చేస్తూ వున్నాడు. దారిలో ఒక స్టేషనులో రైలాగింది. ఒక ఇంగ్లీషు వాడు ఆ Compartment లో ఎక్కినాడు. అప్పట్లో First Class Compartment లో ఇంగ్లీషు వారే ఎక్కాలనే నియమం వుండేది. అందుకని వానికెట్లో అనిపించి నిద్రపోతూన్న వివేకానందుని బూట్లను కిటికీలోంచి పారవేసినాడు. కొంత సేపటికి వివేకానందుడు లేచి వాడు నిద్రపోతూన్న వాలకం చూచి, ఆపరిస్థితిని అర్థం చేసుకొని కొక్కీకి తగిలించి వున్న ఆ ఇంగ్లీషు వాని కోటును కిటికీలోంచి బయట పారేశాడు. కొంతసేపటికి వాడు లేచి అటూ ఇటూ చూచి Where is my coat ? Where is my coat? అని అరిచాడు. అపుడు వివేకానందుడు Your Coat has gone to search my boots అన్నాడు. దక్షత అంటే అది.

**ఉదాసీనః** :-- ఉదాసీనుడంటే పట్టీ పట్టనట్లు ఊరకే వుండువాడు. జ్ఞాని లాంటి భక్తుడు.

**గతవ్యథః** -- వ్యథ లేనివాడు. బాధలు లేనివాడు. తామరాకు పై నీరుంటుంది. కాని తామరాకుకు అంటదు. అలాంటి వాడే గతవ్యథుడు.

**సర్వారంభపరిత్యాగీ** -- భక్తి తప్ప మిగతా కార్యాలన్నీ వదలినవాడు సర్వకర్మ సన్న్యాసమే సర్వారంభ పరిత్యాగం.

**యో న హృష్యతి నద్వేష్టి న శోచతి నకాంక్షతి।**
**శుభాశుభ పరిత్యాగీ భక్తిమాన్యస్సమే ప్రియః॥**

**యోన హృష్యతి** -- సంతోషంతో పొంగిపోడు. హృషీకాలంటే ఇంద్రియాలు. ఇంద్రియాలను జయించినవాడే హృషీకేశుడు. ''హృషీకేన హృషీకేశ సేవనం భక్తిరుచ్యతే'' ఇంద్రియాలచేత భగవత్తత్త్వాన్నిచర్చించి అర్చించుటే భక్తి అనబడును.

**నద్వేష్టి** :-- ద్వేషించడు. భక్తునికి ద్వేషం వుండదు. దుఃఖించే సమయమూ వుండదు. భగవంతుని సేవలోనే సదా కాలం గడుపుతూ వుంటాడు.

**న శోచతి** :-- శోకింపడు. ''నాను శోచంతి పండితాః'' అని

కృష్ణుడన్నాడు, భక్తునికి దుఃఖించేటువంటి విషయమూ వుండదు. దుఃఖించే సమయమూ వుండదు. భగవంతుని సేవలోనే సదా కాలం గడుపుతూ వుంటాడు.

**న కాంక్షతి** :-- భక్తుడు కోరికలు కోరనివాడు. భక్తునికి కోరికలంటూవుంటే భగవత్తత్త్వంపైననే గాని కీర్తి, కాంత, కనకాలపైన మాత్రం కాదు.

**శుభాశుభ పరిత్యాగీ** :-- శుభాశుభాలను కూడా వదలివేసేవాడు భక్తుడు. జీవితంలో శుభాలు, అశుభాలు ఎదురౌతూనే వుంటాయి. వాటన్నిటి మీద సమమైన భావం కలిగి వాటిని పరిత్యాగం చేసినవాడే భక్తుడు. అటువంటి భక్తిగలిగినవాడే భగవంతునికి ప్రియుడు.

**సమశ్శత్రౌ చ మిత్రేచ తథా మానావమానయోః |**
**శీతోష్ణ సుఖదుఃఖేషు సమస్సంగ వివర్జితః ||**

**సమశ్శత్రౌచ మిత్రేచ** :-- అపకారం చేస్తేశత్రువు. ఉపకారం చేస్తే మిత్రుడు. శత్రువులందు, మిత్రులయందు సమమైన భావం కలవాడే భక్తుడు. -- ''అపకారికి నుపకారము నెపమెన్నకసేయువాడే'' అని కదా! సుమతి శతకం.

**మానావమానయో** :-- మానావమానములందు సముడు భక్తుడు. పొగడ్తకు లొంగడు. అవమానానికి క్రుంగడు. 'అవమానాత్తపోవృద్ధిః' అని శ్రుతి వచనం.

**పరాభూతోపి సత్కార కరణే తత్పరో మహాన్ |**
**అహన్తయాచ సంత్యక్తః పరభక్తః ప్రకీర్తితః ||**

ఇతరులచే అవమానం పొందినా వారికి మంచిచేయాలనుకొనే వాడే భక్తుడు. శత్రువుల వల్ల అవమానము, మిత్రులవల్ల సన్మానము కలుగుతూంటాయి. అవమానానికి ద్వేషాన్ని, సన్మానానికి సంతోషాన్ని చూపక సమభావంతో నిశ్చల హృదయుడై వున్నవాడే భక్తుడు.

**శీతోష్ణ సుఖ దుఃఖేషు సమః** :-- చలికాలంలో, ఎండాకాలంలో, సుఖంలో, దుఃఖంలో భేద భావం లేనివాడే భక్తుడు, శీతోష్ణాలు ప్రకృతి ధర్మాలు, సుఖదుఃఖాలు మానసిక ధర్మాలు. శీతోష్ణాలు, సుఖదుఃఖాలు,

మానావమానాలు, ధర్మాధర్మాలు, జయాపజయాలు వీటినే ద్వంద్వాలంటారు. ద్వంద్వాలంటే పరస్పర విరుద్ధాలు. పరస్పర విరుద్ధాలైన ఈ ద్వంద్వాలకు అతీతుడే భక్తుడు. ''పండితాః సమదర్శినః'' అని గీతలో, ''నిర్వైరం సమదర్శినం'' అని భాగవతంలో కృష్ణుడే అన్నాడు గదా!

అర్జునా ! సుఖదుఃఖాలు, చావుపుట్టుకలు, భయాభయాలు నానుండే పుట్టుతున్నాయి అని భగవంతుడు చెప్పాడు. కాబట్టి వీటన్నింటియందు సమభావం కలిగిన వాడే భక్తుడు.

సంగవివర్జితః -- అసంగుడు, నిస్సంగుడు భక్తుడు.

**విసృజ్య సకలాన్సఙ్గాన్ యుక్తో భాగవతైస్సహ ।**

**సదా హరికథాలగ్నః పరభక్తః ప్రకీర్తితః ॥**

తన దేహసంబంధులగు బంధువులను, మిత్రులను, సంఘాన్ని త్యజించి భగవద్భక్తులతో జీవిస్తూ హరికథ లందాసక్తి కనబర్చేవాడు భక్తుడు.

**తుల్యనిందాస్తుతిర్మౌనీ సంతుష్టో యేనకేనచిత్ ।**

**అనికేతః స్థిరమతిః భక్తిమాన్మే ప్రియో నరః ॥**

**తుల్యనిందాస్తుతిః** -- నిందాస్తుతులలో సమానుడు. నిజమైన భక్తుని మీద నింద వేసినా చలించడు. అలాగే స్తుతి చేసినా చలించడు.

**నిందంతు నీతి నిపుణాః యది వాస్తువంతు**

**లక్ష్మీః సమావిశతు గచ్ఛతు వాయథేచ్ఛమ్ ।**

**అద్యైవ వా మరణమస్తు యుగాంతరే వా**

**న్యాయ్యాత్పథః ప్రవిచలంతి పదం నధీరాః ॥**

**మౌనీ** :-- మననశీలుడు. ఊరకుండువాడు. పరమాత్మను మననం చేసేవాడు మౌని. వాడే పరమభక్తుడు. ఊరకుంటే దేవుడు. ఊగులాడ్తే జీవుడు అని సామెత.

**సంతుష్టో యేన కేన చిత్** :-- జీవించడానికి మాత్రం భుజించేవాడు ఏది దొరికినా తిని తృప్తిపడేవాడు భక్తుడు.

**అనికేతః** :-- నిర్దిష్టమైన స్థానం లేనివాడు.

**స్థిరమతిః** -- స్థిరబుద్ధి కలవాడు. చపలత్వం లేనివాడు. అంటే స్థిత ప్రజ్ఞుడు.



# భక్తి మహిమ

మానవుడు భగవద్భక్తి చేత ఎంతటి ఉన్నత స్థితినైనా పొందగలడు. భక్తుడు కష్టాలలో వుంటే భగవంతుడు కాపాడుతూ వుంటాడు. అందుకే మన పెద్దలు 'వత్సం గౌరివ వత్సలా' అన్నారు. ఆవు తనదూడననుసరించి ఎలా తిరుగుతూ వుంటుందో అట్లే భక్తుని అనుసరించి భగవంతుడు తిరుగుతూ వుంటాడు.

**నిరపేక్షం మునిం శాంతం నిర్వైరం సమదర్శినమ్ ।**
**అనువ్రజామ్యహం నిత్యం పూయేయేత్యంఘ్రి రేణుభిః ॥**

ఉద్ధవా! నిరపేక్షుడు, మౌన శీలుడు, శాంత స్వభావుడు, వైరం లేనివాడు, సమదర్శనుడూ అయిన భక్తుడు ఎక్కడ పోతూ వుంటే అక్కడ నేను కూడా పోతూ వుంటాను. ఎందుకంటే నా భక్తుని పాదధూళి తగిలి పవిత్రుడనై పోవాలనే ఆశ అని కృష్ణుడు చెప్పాడు.

ఒకసారి నారదుడు వైకుంఠానికి వెళ్ళాడు. లక్ష్మీదేవి వాకిట్లో కూర్చొని వుంది. అమ్మా ! అయ్యగారు వున్నారా అని శ్రీమన్నారాయణుని గురించి అడిగాడు నారదుడు. పూజ గదిలో వున్నాడు వచ్చే వేళయింది కూర్చోమని చెప్పింది. ఇంతలో నారాయణుడు పూజగదిలో నుండి బయటకు వచ్చాడు. నారదుడు లేచి స్వామీ తమరు ఎవరికిపూజ చేస్తున్నారు అని అడిగాడు. నీవే వెళ్ళిచూడు నారదా ! అన్నాడు నారాయణుడు. లోపల పూజామందిరంలో పెద్ద పెట్టె వుంది. అందులో 14వ పెట్టెలో చిటికెడు దుమ్ము, ఒక చుక్క నీరు కనిపించాయి నారదునికి. ఈ 14 పెట్టెలు 14 లోకాలకు నిదర్శనం. నారదుడు ఆశ్చర్యపోయి ఏమి స్వామీ! ఈ రహస్యం అని అడగ్గా నారదా! ఆదుమ్ము

నా భక్తుని పాద ధూళి. ఆనీటి చుక్క నా భక్తుడు భక్తి తన్మయంతో వదలిన ఆనంద బాష్పం. కన్నీటి చుక్క. అవే నాకు ఆరాధ్యదైవాలు అన్నాడు నారాయణుడు. కాబట్టి భక్తి కలిగివుంటే మనం కూడా భగవంతుని మన అభిమానిగా చేసుకోవచ్చు.

**న తథామే ప్రియతమః ఆత్మయోనిర్న శంకరః।**

**నచ సంకర్షణో న శ్రీః నైవాత్మా చ యథా భవాన్॥**

బ్రహ్మదేవుడు, శంకరుడు, బలరాముడు, లక్ష్మీదేవి వీరందరు నాకు ప్రియులే. అయితే భక్తుడవైన నీకంటే కాదు. అంతెందుకు భక్తుని మీద వుండే ప్రేమ నామీద కూడ నాకు లేదు. భక్తుణ్ణి ప్రేమించినట్లు నన్ను కూడ నేను ప్రేమించుకోను.

**నాహం వసామి వైకుంఠే న యోగి హృదయే రవౌ।**

**మద్భక్తాః యత్ర గాయంతి తత్రతిష్ఠామి నారద ॥**

నారదా! నా భక్తులు గానం చేసే చోట తప్ప వైకుంఠంలో గాని, యోగి హృదయంలో గాని నేనుండలేను.

**కులం పవిత్రం జననీ కృతార్థా**

**విశ్వంభరా పుణ్యవతీచ తేన।**

**అపార సచ్చిత్సుఖసాగరేஉస్మిన్**

**లీనం పరే బ్రహ్మణి యస్య చేతః॥**

అపారమగు సచ్చిదానంద సాగరంలో ఎవరి మనస్సు లీనమగునో వాని వంశం ధన్యమగును. వాని తల్లి ధన్యురాలగును. ఆ మహాత్ముని వలన ఈ భూమి పుణ్య భూమి అగును.

భక్తి చాలా విలువైనది. భక్తులు ఎందరో తరించారు. మన ప్రాచీన పురాణ సారస్వతంలో భక్తుల కథలు కోకొల్లలుగా వస్తాయి. ముఖ్యంగా కలియుగంలో జ్ఞాన యోగాదులకంటే భక్తి యోగమే ఆచరణీయమని శాస్త్రాలు పేర్కొన్నాయి. ''కలౌ భక్తిః కలౌ భక్తిః భక్త్యా కృష్ణః పురః స్థితః'' అంటే కలికాలంలో భక్తే ఆచరణీయం. భక్తి వల్ల కృష్ణుడు ఎదుటికి వస్తాడు. భగవంతుని సాక్షాత్కారం కంటే కోరదగిందే ముంది? అందువల్ల భక్తినే సాధనంగా ఎన్నుకొని తరించాలి.



# ప్రసిద్ధ భక్తులు

## ప్రహ్లాదుడు

ప్రహ్లాదుడు హిరణ్యకశిపుని పుత్రుడు. ఇతని తల్లి లీలావతి. గర్భవతియైన లీలావతిని ఇంద్రుడు తీసుకొని పోతూంటే నారదుడు ఆమెను కాపాడి తన ఆశ్రమమునకు తీసుకుపోయి ఆమెకు తత్త్వోపదేశం చేస్తాడు. కాబట్టే ప్రహ్లాదుడు విష్ణు భక్తుడయ్యాడు.

తాను మాత్రం భగవద్భక్తి కలిగినవాడు సామాన్య భక్తుడు. తన ద్వారా ఇతరులను కూడా భక్తులనుగా చేయువాడు మహా భక్తుడు. అటువంటివాడే ఈ ప్రహ్లాదుడు. ఇతని మనస్సు హరిపరతంత్రమైనది. అందువల్ల ఇతర సంకల్పాలకు, వాంఛలకు ఆయన మనస్సులో స్థానం లేదు.

హిరణ్యకశిపుడు ప్రహ్లాదుని చదువుకోమని--

**చదువని వాడజ్ఞుండగు**
**చదివిన సదసద్వివేక చతురత గలుగున్।**
**చదువగ వలయును జనులకు**
**చదివించెద నార్యులొద్ద చదువుము తండ్రీ !**

అని శుక్రాచార్యుని కుమారులైన చండామర్కుల వద్దకు పంపాడు.

కొన్ని రోజుల తర్వాత కొడుకు ఎలా చదువుతున్నాడో తెలుసుకోవాలని పిలిపించి అడుగగా "చదువులలో మర్మమెల్ల చదివితి తండ్రీ!" అని ప్రహ్లాదుడు నవవిధ భక్తి తత్త్వాలను గూర్చి చెప్పాడు.

**శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్।**
**అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనమ్ ॥**

హరిలేని సంసారములు గ్రుడ్డివానికి చంద్రోదయం వంటివని, చెవిటివాడి ముందర శంఖ మూదినట్లనీ, మూగవాడు సద్గ్రంథముల్ చదివినట్లనీ వచించాడు. మరియు --

**కమలాక్షు నర్చించు కరములు కరములు**
**శ్రీనాథువర్ణించు జిహ్వ జిహ్వ**
**సుర రక్షకుని జూచు చూడ్కులు చూడ్కులు**
**శేషశాయికి మ్రొక్కు శిరము శిరము**
**విష్ణునాకర్ణించు వీనులు వీనులు**
**మధువైరి దవిలిన మనము, మనము**
**భగవంతు వలగొను పదములు పదములు**
**పురుషోత్తముని మీది బుద్ధి బుద్ధి**
**దేవ దేవుని చింతించు దినము దినము**
**చక్రహస్తుని ప్రకటించు చదువు చదువు**
**కుంభినీధవు జెప్పెడి గురుడు గురుడు**
**తండ్రి హరి జేరు మనియెడి తండ్రి తండ్రి**

శ్రీహరిని పూజించే చేతులే చేతులు. ఆయనను గూర్చి పలికే నాలుకే నాలుక, దేవతలను రక్షించే ఆదేవదేవుని చూచే చూపులే చూపులు. శ్రీమన్నారాయణుని మ్రొక్కే శిరమే నిజమైన శిరము. విష్ణు గాథలను గురించి వినే చెవులే చెవులు. ఆయనను చూచే కన్నులే కన్నులు. ఆయనను గురించి నడిచే కాళ్ళే కాళ్ళు. ఆయన మీద ఆధారపడివుండే బుద్ధియే నిజమైన బుద్ధి. ఆయనను గురించి చింతన చేసే దినమే నిజమైన దినము. ఆయనను తెలిపే చదువే చదువు. ఆయనను గురించి చెప్పేవాడే గురువు.

కమలనయనుడైన భగవంతుని సేవలో వినియోగపడని శరీరము వ్యర్థము. శరీరము గాలితో కూడిన తోలుతిత్తి. వైకుంఠుని పొగడని నోరు ఢమ ఢమ అని వాగే ఢక్క మాత్రమే. హరిని పూజించనట్టి చేయి, చెట్టు కొమ్మతో చేసిన చెక్క గరిట వంటిది. ఆ మాధవుని చూడనట్టి కన్నులు, శరీరమనే గోడకుండు రంధ్రముల వంటివి. చక్రి చింతలేనట్టి జన్మ నీటి బుడగవంటిది. ఆవిష్ణువుపైన భక్తి లేనిమానవుడు రెండు పాదాల

పశువు.

వేయిమాటలెందుకు? కేవలం భగవంతుని చింతనామృతం, శ్రవణామృతంతోనే ఈ సంసారాన్ని దాటుట సాధ్యం కాని మరొక మార్గంలేదు అని ప్రహ్లాదుడు తండ్రితో చెప్పాడు.

ఇవన్నీ విని కోపోద్రిక్తుడై ప్రహ్లాదుని చంపమని హిరణ్యకశిపుడు భటులను ఆజ్ఞాపించాడు.

రాక్షసులు ప్రహ్లాదుని ఏనుగులచేత త్రొక్కించారు. పాములచేత కరిపించారు., విషము తినిపించారు. గదలతో కొట్టించారు. పర్వతాల పైనుండి విసిరివేశారు. అయినా ప్రహ్లాదునిలో కాంతి తగ్గలేదు. పరమాత్మను స్మరిస్తూ తానే పరమాత్మైపోయినాడు. ప్రహ్లాదుని చంపాలని చేసిన ప్రయత్నాలన్నీ వృథా అయినాయి. హిరణ్య కశిపుడు చింతాక్రాంతుడైనాడు.

రాక్షస సామ్రాజ్య చక్రవర్తి హిరణ్యకశిపుడెక్కడ ? ఐదేండ్ల బాలుడెక్కడ? భగవద్భక్తిలో శక్తి కి ఇంతకంటే ఉదా హరణ ఏముంటుంది?

చండామార్కులవారు ఈసారి పిల్లవానికి త్రివర్గ విద్య నేర్పిస్తామని తీసుకు పోయారు. ప్రహ్లాదుడు తోటి బాలురకు సంసారం నుండి విముక్తి పొందాలని, కామాది శత్రువర్గాన్ని జయించాలని, గురు శుశ్రూష చేయాలని, సాధు సంగమం కలిగి వుండాలని బోధిస్తాడు.

ఇంకా పుత్ర కళత్రమిత్రాదులు క్షణభంగురాలు. స్వర్గలోక సుఖాలు కూడా తుచ్ఛాలే. మనుష్యులు నిష్కామ హృదయులై హరి భక్తి కలిగి వుండాలి. పశుపక్ష్యాదులు కూడా భక్తి కలిగి వుంటే ధన్యత్వం పొందుతాయి అని కచ్చితంగా చెప్పాడు.

ఇంతలో చండామార్కులు వచ్చి బాలురతో భజన చేయిస్తున్న ప్రహ్లాదుని ఎంత అడుక్కున్నా ప్రహ్లాదుడు భజన చేయించడం మానలేదు. చివరికి హిరణ్యకశిపుడు వచ్చి 'ఒరే! నాకడుపున చెడపుట్టినావు గదరా! నా శత్రువు గురించి నీవు భజన చేయటమేమిటిరా' అని ఇంతకు ఆవిష్ణువెక్కడ వుండాడో చూపించమంటే --

**కలడంభోధి కలండు గాలి కలడాకాశంబునన్ కుంభినిన్**
**కలడగ్నిన్ దిశలన్ బగళ్ళనిశలన్ ఖద్యోత చంద్రాత్మలన్ ।**
**గలడోంకారమునం త్రిమూర్తుల త్రిలింగ వ్యక్తులందంతటన్**
**గలడీశుండు గలండు తండ్రి వెదుకంగా నేల యీ యాయెడన్ ॥**

తండ్రీ! ఆ ప్రభువు అన్నిచోట్ల కలడు. పంచభూతాల్లో వున్నాడు. పగలు, రాత్రి, చుక్కల్లో, చంద్రునిలో, ఓంకారంలో, త్రిమూర్తుల్లో అంతటా వున్నాడు. ఇక్కడ అక్కడ అని వెతక పనిలేదు.

**ఇందుగలడందులేడని సందేహము వలదు చక్రి సర్వోప గతుం ।**
**డెందెందు వెదకి చూచిన అందందే కలడు దానవాగ్రణి వింటే ॥**

సర్వోపగతుడైన చక్రి ఎక్కడెక్కడ వెతికితే అక్కడక్కడ కనిపిస్తాడు అన్నాడు. అయితే ఈస్తంభంలో ఉన్నాడా. అంటే, వున్నాడు తండ్రీ అనిన ప్రహ్లాదుని మాటలకు హిరణ్యకశిపుడు స్తంభాన్ని పగలగొడితే నరరూపంకాదు, సింహరూపంకాదు, నరసింహరూపంతో భగవంతుని మాయావతారం ప్రత్యక్షమైంది. పగలుకాదు, రాత్రికాదు, సంధ్యాసమయం కాదు వాకిలి కడప మీద,తొడలపైన పెట్టుకొని గోళ్ళతో రాక్షసుని చంపినాడు. దేవతలు ఆయన ఉగ్రరూపాన్ని శాంతింప జేయుటకు స్తోత్రాలు చేశారు. ప్రయోజనం లేక లక్ష్మీదేవి దగ్గరకు వెళ్ళి ఆయనను శాంతింపజేయుమని ప్రార్థించారు. ఆమె ప్రయత్నం విఫలమైంది. అపుడు దేవతలందరు ప్రహ్లాదుని ప్రార్థించారు. ఆ భక్తప్రహ్లాదుడు నృసింహుని కాళ్ళకు మ్రొక్కినాడు. నృసింహుడు ప్రసన్నవదనుడైనాడు. ప్రహ్లాదుని ఎత్తు కుని తొడలపై కూర్చోబెట్టుకొని శరీరం నిమురుతూ . . . .

**క్వేదం వయః క్వచ వపుః సుకుమార మేతత్ ।**
**క్షంతవ్యమంగ ! యది మే సమయే విలంబః ॥**

"నాయనా ప్రహ్లాదా! నీవయస్సు చిన్నది. నీ శరీరం కోమలమైంది. ఆదుర్మార్గుడు నిన్ను విపరీతమైన బాధలు పెడుతూంటే నేనొక వేళ నిన్ను రక్షించుటకు ఆలస్యంగా వచ్చివుంటే నన్ను క్షమించు" అంటాడు. ఆనరసింహమూర్తి ఎక్కడ? ఈబాలుడెక్కడ? ఇది భక్తి వాత్సల్యానికి పరాకాష్ఠ.



# ఆంజనేయుడు

కేసరియను వానరుని భార్య అంజన. కేసరి సంసారంతో విసిగి తన భార్యను వాయుదేవుని సేవిస్తూ వుండమని చెప్పి తపస్సుకు వెళ్లాడు. అంజన భక్తికి వాయువు ప్రసన్నుడై తన గర్భమందున్న శివుని వీర్యం ఆమెకిచ్చాడు. దానితో ఆమె గర్భం ధరించి ప్రసవించింది. ఇతడే ఆంజనేయుడు.

ఆంజనేయుడు అపర శివావతారమని శివపురాణం తెలుపుతున్నది. ఇతనికి అనేక నామాలు కలవు. హనుమంతుడు, వాయుపుత్రుడు, మారుతి, అంజనాతనయుడు, మహావీర్, భక్తహనుమాన్ మొదలైనవి.

ఆంజనేయుడు బాల్యంలోనే ఉదయిస్తున్న సూర్యబింబాన్ని చూచి పండు అని భ్రమపడి దానిని మ్రింగబోయాడు. అక్కడకు రాహువు వచ్చి ఆబాలుని బెదిరించాడు. ఆబాలుడు రాహువునే మ్రింగబోయాడు. ఐరావతమునెక్కి ఇంద్రుడు వచ్చి వజ్రాయుధంతో ఆబాలుని హనువు (కణతి) పై కొట్టాడు. అపుడు ఆంజనేయుడు మూర్ఛిల్లాడు. అపుడే హనుమంతుడనే పేరు వచ్చింది. కుమారునికి జరిగిన దానికి కోపగించి వాయుదేవుడు వాయుబంధనం చేశాడు. పరిస్థితి భయంకరంగా మారింది. అపుడు దేవతలు ఇంద్రునితో గూడి వాయుదేవుని ప్రార్థించారు. బ్రహ్మదేవుడు పవన సుతుని తన అమృత హస్తంతో స్పృశించాడు. వెంటనే హనుమంతుడు లేచి కూర్చున్నాడు వాయుదేవా! నీపుత్రుడు అసమాన ప్రజ్ఞాధురంధరుడు మృత్యువు కూడా అతని ఆజ్ఞమేరకే వస్తుంది అతడు 'చిరంజీవి' అని దీవించాడు.

ఆంజనేయుడు విద్య నార్జించుటకు సూర్యుని దగ్గరకు పోయాడు. నేనొక చోట ఉండను గదా! నాదగ్గరెట్లు నేర్చుకోగలవని ప్రశ్నించాడు? అపుడు ఆంజనేయుడు ఉదయాద్రిపై ఒక కాలు అస్తగిరి పై ఒక కాలు వుంచి నిలబడ్డాడు. అతని శక్తికి ఆశ్చర్యపోయి సూర్యభగవానుడు విద్యనేర్పుటకు ఒప్పుకొన్నాడు. ఆంజనేయుడు సూర్యుని ముందు నడుస్తూ విద్య నేర్చుకొన్నాడు.

ఆంజనేయుడు రమణీయ చతురుడు. ప్రథమ సమాగమంలోనే రాముని హృదయాన్ని ఆకర్షించిన ప్రజ్ఞాశాలి. ఋష్యమూక పర్వతం పై మొట్టమొదట రాముని కలసిన ఆంజనేయుడు మహేంద్ర శోభతో అలరారే మీరెవరు? మీ ముఖారవిందాలు మీరు భూమండలాధిపతులనుగా తెలియజేస్తున్నాయి. నేను సుగ్రీవుని సచివుడను అనిన మారుతి మాటల నాలకించి రామచంద్రుడు దూతయను పదమునకు వన్నెతెచ్చువాడు ఇతడే అనుకున్నాడు.

వాలివధానంతరం ఆంజనేయుని ప్రక్కకు పిలిచి సీతాన్వేషణకు అర్హుడవు నీవే అని సుగ్రీవుడు చెప్పాడు. హనుమా! ఈ ఉంగరం తీసుకో! నీవు నా దూతవని తెలియజేయుటకు ఇది ఉపకరిస్తుందని రాముడు పలికాడు.

జటాయువు సోదరుడైన సంపాతి పలుకులు విని ఆంజనేయుడు గరుత్మంతుని వలె ఆకాశానికెగిరి, రామబాణంవలె సాగరాన్ని దాటి సిరిసంపదలతో కుబేరుని అలకాపురి వలెనున్న లంకానగరంలో ప్రవేశించాడు.

అశోకవనంలో శోకవదనయై కూర్చొనియున్న అందాలరాశిని చూచి ఆమెయే సీతాదేవియై ఉండవచ్చునని భావించాడు. ఇంతలో రావణుడు వచ్చి తనమాటవింటే ముల్లోకాల సంపద క్రుమ్మరింతునని పలికాడు. అవివేకపు ఆలోచనలతో జీవితాన్ని అంతమొందించుకోవలదని సీత రావణుని హెచ్చరించింది. రావణుడు నిరాశతో వెడలాడు.

రావణుడు వెళ్ళగానే ఆంజనేయుడు రామకథను గానం చేసి ఆమెలో కలిగిన మార్పును గమనించి, ఆమెయే సీత అని నిర్ధారించుకొని అమ్మా! చింతించవద్దు. నీవు అనతికాలంలో శ్రీరాముని చేరగలవని రామ ప్రతీకను సీతకిచ్చి, తన నిజస్వరూపం చూపి సీతను ఓదార్చి, సీతనుండి 'చూడామణి'ని తీసుకొని, బయలుదేరేముందు రావణుని భయపెట్టవలెనని భయంకర రూపం దాల్చి, చాలామంది రాక్షసులను, రావణుని కుమారుడగు అక్షుడను వానిని సంహరించాడు. ఇంతలో ఇంద్రజిత్తు వచ్చి బ్రహ్మాస్త్రంతో అతనిని బంధించి రావణుని దగ్గరకు తీసుకొని పోయాడు. అపుడు ఆంజనేయుడు నీచరిత్ర ముగియనున్నది.

బ్రహ్మరుద్రాదులెదురైనా మారాముని ఏమీచేయలేరు. అని రావణుని హెచ్చరించాడు.

ఆంజనేయుని వచనాలు రావణాసురునిలో ఆగ్రహాన్ని తెప్పించాయి. హనుమంతుని వధించమని రావణుడు భటులను ఆజ్ఞాపించినాడు. విభీషణుడు అడ్డుపడ్డాడు. దూతను చంపుట ధూర్త లక్షణ మన్నాడు. అంతట భటులు హనుమంతుని తోకకు బట్టలు చుట్టి నిప్పంటించినారు. హనుమంతుడు అగ్నిని, వాయుదేవుని తలచుకొని అశోకవనం, విభీషణ గృహం తప్ప లంకనంతా కాల్చి తిరిగి రాముని చేరినాడు. సీతాదేవి పరిస్థితి నంతా వివరించి 'చూడామణి' ని రాముని కిచ్చినాడు.

**కృతం హనుమతా కార్యం సుమహద్భువి దుష్కరమ్।**
**మనసాపి యదన్యేన నశక్యం ధరణీ తలే॥**

''ఈ భూమండలంలో ఏవ్యక్తి తన మనస్సులో ఊహించుకొనుటకు కూడా దుష్కరమైన పనిని హనుమంతుడు నాకొరకు చేశాడు'' అని హనుమంతుని రాముడు శ్లాఘించాడు.

రావణ వధానంతరం ఆవార్తను సీతకు తెలియ జేశాడు ఆంజనేయుడు. ఇంత చక్కటి వార్తను తెలియ జేసిన నీకు నేనేమి ఇచ్చినా తక్కువే అవుతుందని ఆమె తన కృతజ్ఞతను ప్రకటించింది.

అయోధ్యలో శ్రీరామపట్టాభిషేకం జరిగిన తర్వాత హనుమంతుడు రాముని కడకేగి రామా ! నాకు నీయందు భక్తి చెదరకుండునట్లు అనుగ్రహింపుమంటే-- ''రామకథాగమనం జరుగునంతకాలం నీకీర్తి ప్రతిష్ఠలు అందులో భాగమైవుంటాయ''ని ఆశీర్వదించాడు.

ఆంజనేయుడు భక్తుడుగా, రామదూతగా, పరాక్రమశాలిగా, ఆశ్రితజనులకు కల్పతరువుగా, పసిపిల్లలకు రక్షక స్థానంగా కరుణా హృదయుడుగా కీర్తింపబడుతూనే వున్నాడు.



# మార్కండేయుడు

మృకండుని భార్య మనస్విని. మృకండుముని సంతానం కొరకు శివుని గూర్చి తపస్సు చేయగా శివుడు ప్రత్యక్షమై ఏవరం కావలెనో కోరుకోమన్నాడు. భక్తిమంతుడైన కుమారుని ప్రసాదించమని ముని కోరుకొన్నాడు. తథాస్తు అని శివుడు అదృశ్యమయ్యాడు. ఆ తర్వాత కొంతకాలానికి మనస్విని ఒక మగ శిశువును ప్రసవించింది. తల్లి తండ్రులు అతనికి మార్కండేయుడని పేరు పెట్టారు.

ఒకరోజు ఆపిల్లవానిని జూచుటకు నారదుడు మృకండుని ఇంటికి వచ్చాడు మృకండుడు నారదుని సకల విధాల సత్కరించి, తన కుమారుని ఆశీర్వదించమన్నాడు. నారదుడు ఆ పిల్లవాని అవయవ లక్షణాలను చూచి అల్పాయుస్సు కలవాడుగను, దీర్ఘాయుస్సు పొందువాడుగను గుర్తించి ఓ మునీ! నీకుమారుని కనపడిన బ్రాహ్మణులందరకు మ్రొక్కించుము, వారి ఆశీస్సులతో నీ కుమారుడు దీర్ఘాయుష్మంతుడు కాగలడని చెప్పి వెళ్ళాడు. ఆనాటి నుండి మృకుండుడు తన కుమారుని బ్రాహ్మణులకు నమస్కరించునట్లు ఆజ్ఞాపించాడు.

ఒకనాడు సప్తర్షులు మార్కండేయుని జూచుటకు వచ్చారు. మార్కండేయుడు వరుసగా ఒక్కొక్క ఋషికి మ్రొక్కాడు. వారందరూ అతనిని ''దీర్ఘాయుష్మాన్ భవ'' అని ఆశీర్వదించారు. ఏడవ వాడగు వశిష్ఠుడు మాత్రం నాకు మ్రొక్కవద్దని చెప్పాడు. అపుడు మిగతా ఆరుమంది ఋషులు పిల్లవాడు మ్రొక్కుతుంటే వద్దనడం భావ్యం కాదన్నారు. అపుడు వశిష్ఠుడు ఈ పిల్లవానికి 6 నెలలే ఆయువు ఉంది. మీకు తెలియక ''దీర్ఘాయుష్మాన్ భవ'' అని ఆశీర్వదించారు అని అన్నాడు. అప్పడు ఆఋషులు మా మాటలు నిలబెట్టుకొనుటకు ఏదైనా ఉపాయం చెప్పమన్నారు ఈపిల్లవాడ్ని బ్రహ్మదగ్గరకు తీసుకు పోయి మ్రొక్కిస్తాము. బ్రహ్మ ఏమని ఆశీర్వదిస్తాడో తర్వాత ఆలోచిద్దాం అని చెప్పి, ఆ పిల్లవానిని తీసుకుపోయి బ్రహ్మకు మ్రొక్కించారుఆయన వెంటనే దీర్ఘాయుష్మాన్ భవ, దీర్ఘాయుష్మాన్ భవ అని ఏడుమార్లు ఆశీర్వదించాడు అపుడు వశిష్ఠుడు బ్రహ్మదేవా ! ఈ పిల్ల వానికి ఆరునెలలు మాత్రమే ఆయుస్సు వుంది. మీరేమో దీర్ఘాయుష్మాన్ భవ అని ఆశీర్వదించారు కదా! ఏమి

చేస్తారు అని చెప్పగా బ్రహ్మ ఆలోచించి శివుడు ఆంజనేయునకు పూర్ణాయుస్సును ఇచ్చినాడు గదా! కాబట్టి ఈ పిల్లవాడు శివుని గూర్చి తపస్సు చేస్తే దీర్ఘాయుష్మంతుడు చిరంజీవి కాగలడని ఆశీర్వదించాడు.

మార్కండేయుడు అరణ్యానికి పోయి శివలింగాన్ని దగ్గర పెట్టుకొని తపస్సు ప్రారంభించాడు. బ్రహ్మదేవుడు శివుని దగ్గరకు పోయి ఈశ్వరా! నీవు మార్కండేయునకు 16 యేండ్లు ఆయుస్సు ఇచ్చినది నాకు తెలియదు. మార్కండేయుడు నాకు మ్రొక్కగా దీర్ఘాయుష్మాన్ భవ అని ఏడు మార్లు పలికినాను. నా మాటలు అసత్యములైతే ఈ లోకాలే అసత్యాలవుతాయి. గతులు తప్పతాయి. కాబట్టి నామాటలు చెల్లునట్లు చేయమని ప్రార్థించగా శివుడు బ్రహ్మకు అభయమిచ్చాడు.

మార్కండేయుడు పూజించు శివలింగమునందు శివుడు ఐక్యమైనాడు. ఇంతలో మార్కండేయునకు 16 సంవత్సరములు నిండాయి. యముడు వచ్చి తన పాశమును మార్కండేయుని కంఠానికి బిగించి లాగాడు. ఓ యమధర్మరాజా ! నేను శివ పూజ చేస్తున్నాను. ఈపూజపూర్తయ్యేవరకు నాజోలికి రావద్దని మార్కండేయుడు యముని హెచ్చరించాడు. మార్కండేయా ! నీకు శివుడిచ్చిన గడువు తీరిపోయింది. శివుడు లాంటి వాళ్ళు చాలామంది నాచే చంపబడ్డారు. ఇక నీవెంత అని యముడు పాశాన్ని గట్టిగా లాగబోయాడు. కాని మార్కండేయుడు నిశ్చలంగా "చంద్రశేఖర చంద్రశేఖర చంద్రశేఖర పాహిమాం" అంటూ స్తోత్రం చేస్తూ శివలింగాన్ని కౌగిలించుకొన్నాడు.

అపుడు శివుడు ప్రత్యక్షమై యముని నిగ్రహించాడు. యముడు పరమేశ్వరునికి సాష్టాంగ నమస్కారం చేశాడు. యమధర్మరాజా ! మార్కండేయుడు నాభక్తుడు కనుక రక్షించాను. ఇకమీదట నాభక్తుల జోలికి వెళ్ళకు. అని శివుడు యముని హెచ్చరించాడు. బ్రహ్మదేవుడు మార్కండేయుని ఏడుమార్లు దీర్ఘాయుష్మాన్ భవ అని ఆశీర్వదించాడు. నేను 7 కల్పములు జీవించునట్లుగా ఆశీర్వదిస్తున్నానని పలికి ఆశీర్వదించాడు.

యముడంతటి వాటిని దద్దరింపజేసిన మార్కండేయుడు మహాభక్తుడు. అతని కథ చిరస్మరణీయం. ★ ★ ★

# పురందరదాసు

శ్రీనివాసనాయకుడు 15వ శతాబ్దం వాడు. తన తండ్రి వలె తాను కూడా రత్నాల వ్యాపారి. పరమలోభి. ఇతని భార్య సరస్వతీభాయి. గుణవతి, శీలవతి, భక్తురాలు.

ఒకనాడు ఒక పేద బ్రాహ్మణుడు శ్రీనివాసుని దగ్గరకు వచ్చి తన కుమారుని ఉపనయనానికి ఆర్థిక సహాయం చేయమని అడిగాడు. శ్రీనివాసుడు రేపురా రేపురా అంటూ ఆరు నెలలు తిప్పకొన్నాడు. ఒకనాడు శ్రీనివాసుడు ఇంటిలో లేనపుడు ముక్కుపుడకనిచ్చి, ఇకరావద్దని శ్రీనివాసుని భార్య చెప్పింది.

బ్రాహ్మణుడు ఇంటికి వెళ్ళి తన కుమారుని పిలిచి ముక్కు పుడకను అమ్మిరమ్మని చెప్పాడు. ఆకుర్రవాడు శ్రీనివాసుని అంగడికెళ్ళి అమ్మబోయాడు. అది తన భార్యదని గుర్తించిన శ్రీనివాసుడు ధర నిర్ణయించాలని, తర్వాత రమ్మని పలికి అంగడికి తాళం వేసి ఇంటికి పోయాడు. హఠాత్తుగా అంగడి వదలి వచ్చిన భర్తను చూచి సరస్వతీ బాయి ఆశ్చర్య పోయింది. ఆమెను చూచి నీముక్కుపుడక ఏమైందని అడిగింది. స్నానం చేయాలని పూజగదిలో వుంచానని ఆమె చెప్పింది. శ్రీనివాసుడు తీసుకురమ్మని గద్దించాడు. భర్తకు అబద్ధం చెప్పి మోసం చేస్తున్నావని బాధ పడ్తూ పాండురంగా! నీవే కాపాడాలనుకుంటూ, ఒక గిన్నెలో విషం కలుపుకొని తాగ బోతుంటే ఆగిన్నెలో ముక్కుపుడక కనిపించింది. మహా ప్రసాదమని భావించి ఆమె అపుడకను తె చ్చి భర్తకిచ్చింది.

శ్రీనివాసుడు ఆశ్చర్యంతో దిక్కుతోచక ఆముక్కు పుడకను తీసుకెళ్ళి, అంగడి తాళాలు తీసి చూచాడు. తను వుంచిన ముక్కుపుడక కనిపించలేదు. ఈముక్కపుడక తన భార్యకు చేర్చిందెవరు. అనే భావన మనసులో మెదలగానే మనిషిలో మార్పువచ్చింది. ఇంటికి చేరి భార్యనే గురువుగా భావించి తన ఆస్తినంతా దానం చేసి, పండరీపురం బయలుదేరాడు.

శ్రీనివాసుడు సతీసమేతుడై ప్రక్కగ్రామానికి చేరాడు రాత్రయింది. వారు నిద్రబోయారు. శ్రీనివాసునికి స్వప్నంలో

పాండురంగడు కనిపించి హంపిలో వ్యాసరాయ గురుదేవుల వద్ద మంత్రోపదేశం పొందమని, తర్వాత పండరీపురం చేరితే తన దర్శనం కలుగుతుందని చెప్పాడు.

శ్రీనివాసుడు హంపిలో శ్రీవ్యాసరాయుల వారిని దర్శించి గురుదేవా! గతమంతా భగవంతుని మరచి బంగారాన్ని స్మరించాను. భగవదనుగ్రహంతో నా భార్య ద్వారా నాకు జ్ఞానోదయమైంది. తమను గురువుగా స్వీకరించి తరించాలని వచ్చాను. కనికరించమని వ్యాసరాయల పాదాలపై బడ్డాడు.

శ్రీవ్యాసరాయలు శ్రీనివాసా ! అంతా భగవంతుని దయ. నీవు తప్పక తరిస్తావు అని ఆశీర్వదించి, మంత్రోపదేశం చేసి దాస సంప్రదాయంలోకి శ్రీనివాసుని గ్రహించి పురందరదాసు అని పేరు పెట్టారు.

పురందరదాసు హంపినుండి తిరుమల చేరాడు. శంఖ చక్రాలతో, కౌస్తుభమణి హారాలతో, లక్ష్మీ సమేతుడైన తిరుమలేశుని దర్శించి భగవంతుడా! నీ నేత్రాలను నామాలు కప్పి ఉంచడములోని ఆంతర్యాన్ని గ్రహించాను. ''దృష్టిని బహిర్ముఖంగా వస్తు ప్రపంచంపై సారించడం వలన ఉపయోగం లేదని, ఆంతరంగిక దృష్టితో ఆత్మానుభూతిని పొంది తరించుటయే కర్తవ్యమని గ్రహించాను'' అని వేంకటాచలాధినాథుణ్ణి వేనోళ్ళ కీర్తించాడు.

తిరుమల నుండి బేలూరు వెళ్ళి చెన్నకేశవ స్వామిని దర్శించాడు. పురందరుని దృష్టికి స్వామి బాలక్రిష్ణుడు ఏడుస్తున్నట్లుగా దర్శనమిచ్చాడు. పురందరునికి మాతృవాత్సల్యం ఏర్పడింది. తాను యశోదగా బాలకృష్ణుని ఓదారుస్తూ ఒక కీర్తన గానం చేశాడు. కర్ణాటకలో ఇపుడు కూడ ఈకీర్తనను పిల్లలు ఏడ్చినపుడు తల్లులు పాడుతూ వుంటారు.

''కన్నయ్యా! ఎందుకు అనవసరంగా ఏడుస్తావు? ఏంజరిగిందని? ఏడుపు ఆపకపోతే గుడ్లగూబను పిలుస్తాను. నీవు బాలుడుగా వుండేటపుడు పూతన అనే రాక్షసి నీకు పాలివ్వడానికి వచ్చింది. నీమహిమతో ఆపూతన ప్రాణాలే హరించావు. అది చూచి ఎవరైనా దిష్టి పెట్టారా? ఆవుల మేపేటపుడు భయంకరంగా వర్షం వస్తే

గోవర్ధన పర్వతాన్ని చిటికిన వ్రేలితో ఎత్తి గోకులాన్ని రక్షించావు. అందువలన నీవేలికి నెప్పి గలిగి ఏడుస్తున్నావా? నీ ఏడుపు ఆపి దర్శనమిమ్ము. నీదర్శనం ద్వారా మా ఏడుపు మాపు'' అని పురందరుడు ప్రార్థించాడు.

పురందరుడు బేలూరు నుండి పండలీపురం చేరాడు. నిత్యం స్వామి దర్శనంతో సంకీర్తనలతో తృప్తి చెందుతూ అక్కడే స్థిరపడిపోయాడు. పురందరునితో పాటు జీవించే అప్పన్న రోజూ వేకువ జామున పురందరుని స్నానానికి నీరు సిద్ధం చేసే వాడు. ఒకరోజు అప్పన్న అలసి నిద్రపోయాడు. ఆలస్యంగా నీళ్లు తెచ్చినందుకు పురందరుడు కోపగించి అప్పన్న తలపై కొట్టాడు. తొందరగా స్నానం చేసి గుడికి వెళ్తూ వుంటే, ఇంతలో నీళ్లు తీసుకొచ్చిన అప్పన్న స్వామీ! తమరు స్నానం చేయకనే తిరుచూర్ణాదులు ధరించి బయలుదేరారు. గుడికేనా అని, మెలకువ రాలేదు స్వామీ కాస్త ఆలస్యమైంది క్షమించమంటాడు.

పురందరుడు చకితుడైనాడు. అదేమిటి అప్పన్నా! నీవేగా నీళ్లుతెచ్చావు. వాటితోనే గదా స్నానం చేశానన్నాడు. స్వామీ! ఈరోజు మీదర్శనం నాకిదే ప్రథమం అన్నాడు అప్పన్న. పురందరునికి విషయం అర్థమైంది. పాండురంగా! ఈముసలివాని స్నానానికి నీళ్ళ కూడా తెచ్చావా. పైగా ఆలస్యంగా తెచ్చావని కొట్టాను కదా దేవా! అని బాధపడుతూ గుడికి వెళ్ళాడు.

సుప్రభాత దర్శనం జరిగింది. కాని పాండురంగని తలపై వాపు ఏర్పడింది. అది చూచి భక్తులంతా చర్చించు కుంటున్నారు. పురందరునికి విషయం అర్థమైంది. ఓపండరీనాథా! తెలియక చేసిన నేరానికి దోషిగా నిలబెడుతున్నావా! అప్పన్న అనే భావంతో కొట్టాను. అప్పన్న రూపంలో వచ్చింది నీవేనని తరువాత తెలిసింది. క్షమాపణ కోరడానికే వచ్చాను. క్షమించు తండ్రీ అని పురందరుడు ప్రార్థించగానే తలపై వాపు తగ్గింది. మందహాసంతో పాండురంగడు దర్శనమిచ్చాడు.

పురందరుడు అనేక కృతులు రచించి, చివరికి ఆపాండురంగనిలోనే ఐక్యమైనాడు. భక్తప్రపంచంలో పురందరుడు అమర భక్తుడు. ''దాసరేందర దాసర పురందర దాసరా'' ''దాసులలో పురందరుడొక్కడే దాసుడు'' అని ప్రసిద్ధి పొందాడు. ★ ★ ★

# గజేంద్రుడు

పాలసముద్రంలో త్రికూటమనే పర్వతముండేది. ఆపర్వతం చాలా ఎత్తుగా, అత్యంత విశాలంగా ఉండేది. అందులో చాలా సెలయేళ్ళు ప్రవహించేవి. మహావృక్షాలతో ఆపరిసరాలన్నీ నిండిపోయి వుండేవి. గరుడ గంధర్వాది దేవతలు అక్కడ నివసిస్తూ వుండేవారు. గండభేరుండాది పక్షులు, శరభ శార్దూలాది క్రూరమృగాలు కూడా వుండేవి.

ఒకనాటి సాయంకాలం గజసమూహమొకటి ఆవనంలో భయంకరంగా ఘీంకరిస్తూ చెట్లు విరిచేస్తూ ఒక దాని నొకటి ఢీకొంటూ సంచరించింది. ఆ గజసమూహం అరుపులకు మృగాలు పక్షులు భయపడి దిక్కుకొకటి లెక్కన పారిపోయాయి.

ఆ గజరాజసమూహం ఈ విధంగా స్వైరవిహారం చేసి అలసి ఒక సరోవరంలో దిగి అల్లకల్లోలం చేస్తుండగా, అందులో వున్న మకరం అదిరిపడి సూర్యుని రాహువు పట్టుకొన్నట్లు గజరాజైన మదగజేంద్రుని కాలు పట్టు కొన్నది.

**కరిదిగుచు మకరి సరసికి**
**గరి దరికిని మకరి దిగుచు గరికరబెరయన్ ।**
**గరికి మకరి మకరికి గరి**
**భరమనుచును నతల కుతల భటులరుదుపడన్ ॥**

ఏనుగు బైటకు మొసలి నీటిలోనికి లాగాయి. ఇలా వారిరువురుకి వెయ్యేండ్లు పోరాటం జరిగింది. కరి మకరాల పోరాటంతో జలచరాలన్నీ మరణించసాగాయి. 'స్థాన బలిమి కాని తన బలవముకాదయా' అన్నట్లు రోజురోజుకు మొసలి బలవు పుంజుకుంటూండగా గజరాజు పోరాడి పోరాడి తన శక్తిని కోల్పోయి ఆర్తత్రాణ పరాయణుడైన శ్రీమన్నారాయణుని నీవు తప్ప ఇంకెవరూ నన్ను కాపాడలేరు. దేవా ! రావా! కావరా! అని వైకుంఠవాసుని మనసారా ప్రార్థించింది.

**లావొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యె ప్రాణంబులున్**
**ఠావుల్ దప్పెను మూర్ఛ వచ్చె దనువున్ డస్సెన్ శ్రమంబయ్యెడిన్ ।**

**నీవేతప్ప ఇతఃపరంబెఱుగ మన్నింపదగున్ దీనునిన్**

**రావే ఈశ్వర ! కావవే వరద! సంరక్షింపు భద్రాత్మకా ॥**

ఆర్తుడైన గజేంద్రుని మొరాలించిన విష్ణుమూర్తి లక్ష్మీదేవికి చెప్పకనే ఆయుధాలు ధరించకనే వాహనమ్మైన గరుత్మంతుని పిలువకనే తన భక్తుని రక్షించుటకు బయలు దేరాడు.

**సిరికింజెప్పడు శంఖచక్రయుగముంజేదోయి సంధింపడే**

**పరివారంబును జీరడభ్రగపతిం బన్నింప డాకర్ణి కాం ।**

**తర ధమ్మిల్లము జక్కనొత్తడు వివాద ప్రోత్థిత శ్రీకుచో**

**పరి చేలాంచలమైన వీడడు గజప్రాణ వనోత్సాహియై ॥**

ఇలా పోతున్న ఆవిశ్వరక్షకుణ్ణి బ్రహ్మాది దేవతలు, శంఖచక్రాలు, సకల పరివారము వెంబడించాయి.

శ్రీహరి కరిమకరాలు పోరాడుతున్న సరోవరం దగ్గరకు వచ్చి తన చక్రంతో మకరి శిరస్సును ఖండించాడు. ఆర్తుడైన గజేంద్రుని కాపాడాడు. శక్తి హీనుడైన గజేంద్రుడు మహావిష్ణువు పాదాలపై బడి అనేక రకాల స్తుతించి తరించాడు.

గజేంద్రుడు పూర్వజన్మలో ఇంద్రద్యుమ్నుడను ద్రవిడ దేశపురాజు. అగస్త్యుడొకనాడు తన వద్దకు రాగా అతనికి సరిగా మర్యాద చేయలేదని కోపించి కరివి కమ్మని శపించాడు. ఆకారణంగా అతడు మదగజరాజుగా జన్మించి అరణ్యంలో తిరుగుతూ మొసలిచే పట్టుబడి శక్తినంతా కోల్పోయి గర్వరహితుడై భక్తి ప్రపత్తులతో శ్రీహరిని ప్రార్థించి శాపవిముక్తుడయ్యాడు.

మొసలి పూర్వ జన్మలో హూ హూ నామ గంధర్వుడు. దేవలుని శాపంతో మొసలియై ఆమడుగులో వుంటూ గజేంద్రుని బట్టి శ్రీహరి చేత చంపబడి గంధర్వుడుగా పూర్వరూపాన్ని పొందాడు.

గజేంద్రుని కథ శరణాగతుడైన భక్తుని భగవంతుడు ఎలా రక్షిస్తాడో తెలియ చేస్తున్నది. శరణాగతి మార్గం చాలా ప్రశస్తమైనది. గీతలో 'సర్వధర్మాన్ పరిత్యజ్య' అన్నట్లు కథలో ప్రపత్తి లేక శరణాగతి వర్ణించబడింది.

★ ★ ★



# ధ్రువుడు

సునీతి ఉత్తానపాదుల కుమారుడు ధ్రువుడు. ధ్రువుని సవతి తల్లి సురుచి. ధ్రువుడు బాల్యంలో తన తండ్రి తొడపై కూర్చొని వుండగా సవతి తల్లి చూచి నా కొడుకు కూర్చొనే చోట నీవు కూర్చొనుటకు వీలులేదు. నా కడుపులో పుట్టిన వాడు మాత్రమే అక్కడ కూర్చొనుటకు అర్హుడు అని తన తండ్రి తొడపైనున్న ధ్రువుని తోసింది. ధ్రువుడు యేడుస్తూ తన తల్లి వద్దకు పోయాడు. దాసీల ద్వారా విషయం తెలుసుకొనిన సునీతి తన బిడ్డను ఓదార్చి, 'దిక్కులేనివారికి దేవుడే దిక్కు' కాబట్టి నీవా భక్తవత్సలుడైన శ్రీమన్నారాయణుని ఆశ్రయింపుమని పలికింది.

తల్లి ఆశీస్సులతో శ్రీహరిని గూర్చి తపస్సు చేయ నిశ్చయించుకొని వెళ్ళుతుండగా మార్గమధ్యంలో నారదుడు ఎదురై బాలకా ! రాజకుమారుడవు ఈ అరణ్యంలో ఒంటరిగా పోతున్నావు ఎక్కడికి అని నారదుడు అడిగాడు. స్వామీ! మాపినతల్లి నాహృదయాన్ని వ్రణ పరచినది. దాని నివారణకు భగవద్ధ్యానం చేయాలని, తద్వారా శాంతిని పొందాలని పోతున్నానని తమకు తెలిస్తే భగవంతుని చేరే మార్గం తెలుపుమని ధ్రువుడు పలికాడు. కుమారా! మోక్షానికీ, శాంతికి మార్గం ఆ భగవంతుని ధ్యానించడమే. యమునా నదీ తీరంలో మధువనం వుంది. యమునలో స్నానం చేసి, త్రికరణ శుద్ధితో ఆవనమందు శ్రీహరిని గూర్చి తపస్సు చేయమని అష్టాక్షరీ మంత్రాన్ని ఉపదేశించాడు.

నారదుడు ఉత్తాన పాద మహారాజు నగరానికి పోయి ధ్రువుని గూర్చి - నీకుమారుడు శ్రీహరిని గూర్చి తపస్సు చేసి సద్గతిని, సత్కీర్తిని పొంది రాగలడని నీవు నిశ్చింతగా వుండుమని కించిత్తు కూడా బాధపడవలదని పలికాడు. నారదుని మాట విని ఉత్తానపాదుడు కుమారుని రాకకై ఎదురుచూస్తూ వుండిపోయాడు.

ధ్రువుడు మధువనానికి పోయి ఆవన సౌందర్యాన్ని చూసి ముగ్ధుడై యమునలో స్నానం చేసి నిర్మల చిత్తుడై తపస్సు ఆరంభించాడు. అపుడపుడు ఆవనంలో వున్న ఫలములను తింటూ క్రమేణా ఆహారం తీసుకొనుట మాని కేవలం వాయు భక్షణంతో ఒంటి పాదంపై నిలబడి ఉచ్ఛ్వాస నిశ్వాసములు నిలిపి తపస్సు తీవ్రతరం చేశాడు.

ఈవిధంగా ధ్రువుడు నిశ్చల భక్తితో కఠోరమైన తపస్సు చేస్తూ వుండగా అన్నిలోకాలలో వేడి పుట్టింది. ఆ వేడికి సకల ప్రాణులు దేవతలు కూడ తట్టుకోలేక పోయారు. అపుడు ఇంద్రాది దేవతలు శ్రీమన్నారాయణుని కడకేగి శ్రీహరీ! సర్వేశ్వరా! మా ప్రాణాలు పోయేంత వేడి పుట్టింది. కారణం తెలియదు. ఈ పరిస్థితులలో మీరే మమ్ములను కాపాడాలని ప్రార్థించారు.

అపుడు శ్రీమన్నారాయణుడు దేవతలారా! భూలోకంలో ఉత్తానపాదుని కొడుకు నిశ్చల శ్వాసతో, నిర్మల హృదయంతో, ఏకాగ్రతతో తపస్సు చేస్తున్నాడు. కాబట్టి మీకు ప్రాణాపాయ స్థితి ఏర్పడింది. నేను పోయి అతని తపస్సు నిలుపుతాను. మీరు నిశ్చింతగా మీమీలోకాలకు పొండని చెప్పాడు.

వెంటనే విష్ణుమూర్తి మధువనానికి పోయి తపస్సు చేస్తున్న ధ్రువుని ఎదుట నిలిచాడు. ధ్రువుడు కళ్ళుతెరచి లక్ష్మీరమణునికి సాష్టాంగ ప్రణామముచేశాడు. శ్రీహరి తన శంఖంతో ఆబాలుని తలను తాకాడు. వెంటనే ధ్రువుడు భక్తి భావంతో చరాచర జగత్తుకు కారకుడవు, పరమ పురుషుడవు, దయామయుడవు అయిన ఓదేవా! నన్ను సంసారబంధంలో పడనీయక రక్షింపుమని స్తుతించాడు.

అట్లు స్తుతించిన ధ్రువుని చూసి శ్రీహరి సంతసించి రాజకుమారా! నీ తపస్సుకు సంతోషించాను. ప్రళయ కాలంలో కూడా నశించని శాశ్వత ధ్రువస్థానాన్ని నీకిస్తున్నాను. నీ తండ్రి తదుపరి నీవు రాజ్యపాలకుడవై ధర్మాన్ని తప్పక కాపాడుము. నీ తమ్ముడు వేటకుపోయి యక్షుని వలన మరణిస్తాడు. తర్వాత నీవు నాగురించి అనేక యజ్ఞములు చేసి ఇహలోక సుఖాలను అనుభవించి అంత్యకాలమున నన్నేతలచి ధ్రువపదమును పొందగలవని దీవించి అదృశ్యమయ్యాడు.

ఉత్తానపాద మహారాజు తన కుమారుని ఆగమన వార్తవిని సంతోషంతో సపరివారంగా ఎదురేగి కౌగిలించుకొని ఆశీర్వదించాడు. తండ్రి ఆశీర్వాదం పొందిన ధ్రువుడు పులకాంకిత శరీరుడై తండ్రికి సాగిలబడి నమస్కరించాడు. ఉత్తానపాదుడు ధ్రువుని మంగళవాద్యాలతో

అంతఃపురానికి తీసుకొని వస్తూ వుండగా అంతఃపుర కాంతలు ముత్యాలు జల్లి నీరాజనమిచ్చి ఆశీర్వదించారు.

కొంతకాలం తర్వాత ఉత్తానపాదుడు ధ్రువునకు రాజ్యాన్నిచ్చి తాను తపస్సు చేసుకొనుటకు అడవికి వెళ్ళాడు. ధ్రువుని తమ్ముడు ఉత్తముడు వేటకు పోయి యక్షునిచేత చంపబడ్డాడు. ఆమరణ వార్త విని పుత్రశోకంతో సురుచి మరణించింది.

సత్యాన్ని, ధర్మాన్ని వీడక రాజ్యాన్ని పాలిస్తున్న ధ్రువునకు శింశుమార ప్రజాపతి కూతురు 'భ్రమి' అనునామెతో వివాహం అయ్యింది. వారికి కల్పుడు, వత్సరుడు అను ఇద్దరు కుమారులు కలిగారు. ధ్రువునకు ధన్య అను భార్య యందు శిష్టుడను కుమారుడు కలిగాడు. వాయు పుత్రికయైన ఇలయందు ఉత్కలుడు జన్మించాడు. శంభువు అను భార్య యందు భవ్యుడు, శ్లిష్టి అను పుత్రులు కలిగారు.

ధ్రువుడు పూర్వజన్మలో సదాచారపరుడైన బ్రాహ్మణుడు. దైవభక్తి కలవాడు. ఇతడొక రాజుతో స్నేహం చేసి రాజ్యమేలాలనే కోరిక కలిగి వుండేవాడు. అందువలన తర్వాత జన్మలో క్షత్రియుడై పుట్టాడు.

తుదకు ప్రజలను కన్నవారివలె పాలించుచూ కీర్తి ప్రతిష్ఠలు గడించి భగవద్భక్తితో అసువులు బాసి ధ్రువపదాన్ని పొందాడు.

